# భజే శ్రీనివాసమ్

## ఇరవై ఏడు నక్షత్రాల శ్రీనివాస దివ్య వైభవం



తిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తి



పూర్తి పేరు తిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తి. 1956లో పశ్చిమగోదావరి జిల్లా పోతునూరు గ్రామంలో శ్రీ లక్ష్మీ నరసింహారావు, శ్రీమతి నాగరత్నాంబ దంపతులకు ప్రథమ సంతానంగా పుట్టాను. 1983లో రీజనల్ ఇంజనీరింగ్ కాలేజ, వరంగల్ నుండి ఎం.టెక్. చదివిన నేను 1984 దాకా ఆల్విన్‌లోనూ, 1998 దాకా ఎం.వి.ఎస్.ఆర్. ఇంజనీరింగ్ కాలేజిలోనూ ఉద్యోగం చేయడం జరిగింది. 1983లో చి॥సౌ॥ వేంకట రుక్మిణి వైదేహితో వివాహం. ముగ్గురు పిల్లలు, ఆనంది, ఆముక్త, ఆదిత్య శ్రీనివాస్‌లు.

1998 నుండి బిజినెస్ సంస్థలకు వేదశాస్త్రాలు, జ్యోతిష్య శాస్త్రం ఆధారంగా పేర్లు నిర్ణయించటం, లోగోలు డిజైన్ చేయడంలో నిమగ్నమై ఉన్నాను. ఇప్పటిదాకా నేను లోగోలు డిజైన్ చేసిన 3,000 పైగా సంస్థలు దేశ, విదేశాలలో ప్రముఖ స్థానంలో ఉన్నాయంటే అదంతా ఆ శ్రీనివాసుని అనుగ్రహం తప్ప మరొకటి కాదు.

నా జీవితంలో శ్రీనివాసుని లీలలు చూడని రోజు లేదు. ఆ స్వామే నా సర్వస్వం. ఆ స్వామి దయవలననే ఇంతకు ముందు శ్రీ శ్రీనివాస మాహాత్మ్యము, శ్రీ వేంకటేశ్వర వ్రతకల్పము, శ్రీ వేంకటేశ్వర దర్శనము, అమృతసోపానము, Sri Srinivasa-Lord of Seven Hills, యోగక్షేమం వహామ్యహమ్, ఇప్పటి ఈ భజే శ్రీనివాసమ్ వ్రాయగలిగాను. ఇవన్నీ కూడా శ్రీవారి మహాప్రసాదంగా భావిస్తున్నాను. ఈ రచనలన్నింటినీ www.lordofsevenhills.com వెబ్‌సైట్‌లో చూడవచ్చును.

ఆకాశంలోని నక్షత్రాలకు, భూమిమీద మానవజీవితానికీ ఎంతో సంబంధం వున్నది. ఆ శ్రీనివాసుని అనుగ్రహంతో ఒక్కొక్క నక్షత్రానికీ ఒక్కొక్క అధ్యాయంతో ఈ పుస్తకం వ్రాయడం జరిగింది. అన్నీ కూడా శ్రీనివాసుని గుణాలను, భక్త వాత్సల్యతను కీర్తించేవే. ఏ నక్షత్రం నాడు ఆ నక్షత్రపు కథ చదువుకుంటే ఎంతో శుభప్రదం.

శ్రీ వేంకటతత్త్వం అర్థం చేసుకుంటే అంతటి మహదానందం మరొకటి ఉండదు. అంతటి అమృత తత్త్వాన్ని ప్రజలందరి చేరువలోకి తీసుకువెళ్లడమే నా జీవిత పరమావధి.

# భజే శ్రీనివాసమ్

(ఇరవై ఏడు నక్షత్రాల శ్రీనివాస దివ్య వైభవం)

రచన

తిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తి
(T.V.R.K. Murthy, M.Tech)

శ్రీం
శ్రీ డిజైన్స్

**Vedic Business Consultants**
**www.shridesigns.net**
**www.lordofsevenhills.com**
**Phone : 040- 65885750.**
**హైదరాబాదు**
**2009**

**భజే శ్రీనివాసమ్**

**(ఇరవై ఏడు నక్షత్రాల శ్రీనివాస దివ్య వైభవం)**

**తిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తి**



ప్రథమ ముద్రణ

**2009**

వెల :
**Rs. 100/-**

కాపీలకు
**"Viswapathi"**
**T.V.R.K. MURTHY, M.Tech**
Flat No. 202, Plot No. 32,
Srikar's Ravi Residency,
Beside Nalanda High School,
Near Motinagar 'X' Roads,
HYDERABAD - 500 018, India.
Ph : 040 - 65885750.
Cell : 98494 43752
Email : viswapathi@yahoo.com
vediclogos@yahoo.com

Designed & Printed at :
**SRI VASAVI GRAPHICS,**
1A, 1st Floor, Ameepet,
Hyderabad. 9247797342.

# భజే శ్రీనివాసమ్

## విషయసూచిక



* * *

# నివేదన

'అహో రాత్రే పార్శ్వే, నక్షత్రాని రూపం అశ్వినౌ వ్యాత్తమ్.'

పరమపురుషుడైన శ్రీమన్నారాయణుని వర్ణనలో రేయింబవళ్ళు నీకు యిరుపక్కలు, నక్షత్రములు నీ ఆకారము, అశ్వినులు నీ పెదవులు అని వర్ణించబడింది. మనకు ఆకాశంలో కనబడే నక్షత్ర మండలాలు, గ్రహమండలాలు, సూర్యచంద్రులు అన్నీ ఈ విరాట్ పురుషుని లోనివే.

ఆకాశంలో అనేక నక్షత్రమండలాలున్నాయి. మనకు తెలిసిన ఇరవై ఏడు నక్షత్రాలు రవి సంచార మార్గంలోనివి మాత్రమే. ఇవి కూడా కొన్ని నక్షత్రాల గుంపులు. 360డిగ్రీల రవి సంచార మార్గంలో చంద్రుడు ప్రతిరోజూ ఏ నక్షత్రానికి దగ్గరగా కనిపిస్తాడో అదే ఆ నాటి నక్షత్రంగా వ్యవహరించబడుతున్నది. ఇంత మునుపు చెప్పినట్లుగా ఆకాశంలో ఎన్నో నక్షత్ర మండలాలు వున్నప్పటికీ గ్రహ సంచార మార్గం కలిగిన ఈ అశ్వనీ మొదలు రేవతి వరకు గల ఇరవై ఏడు నక్షత్రాలకే ప్రాముఖ్యత కలిగింది. ఈ నక్షత్రాలన్నీ కూడా అనేక ఆకృతులలో వుంటాయి. ఉదాహరణకు అశ్వనీ అంటే గుర్రపు ముఖం రూపంలో వుండే మూడు నక్షత్రాల సముదాయం.

నక్షత్రాలకు మన వైదిక ధర్మంలో ఎంతో ప్రాముఖ్యత వున్నది. అంతే కాకుండా ఒక్కో నక్షత్రంలో పుట్టిన జీవికి కొన్ని కొన్ని ప్రత్యేక లక్షణాలుంటాయి. ఈ రోజులలో అంతగా ఎవరూ పాటించకపోయినా గడచిన రోజులలో నక్షత్రం బట్టే మనుషుల పేర్లు నిర్ణయింపబడేవి.

మన పండుగలు, మన జీవన సరళి మొత్తం నక్షత్రాలతో ఎంతో సంబంధం కలిగి వుంది. ప్రతీ నక్షత్రానికి అధి దేవతలు వున్నారు. ఆ నక్షత్రం ఆకాశంలో ఉన్న ప్రదేశం బట్టి, అవి తూర్పు ఆకాశంలో సూర్యోదయం కన్నా ముందు, సూర్యాస్తమయం తరువాత ఉదయించటం బట్టి అవి ఉదయించేటప్పుడు గల ప్రకృతి పరిస్థితులను బట్టి, ఆ నక్షత్రాలలో రవి ప్రవేశించినప్పుడు జరిగే ఋతు, ప్రకృతి సంబంధమైన మార్పులను బట్టి ఆయా నక్షత్రాలకు అధిదేవతలు నిర్ణయించబడ్డారు.

ఈ నక్షత్రాలు ఆకాశంలో కనబడే సమయాలకు భూమి మీద మానవ జీవితాలకు ఎంతో అవినాభావ సంబంధం వున్నది. మనం భూమిమీద జరుపుకునే ప్రతీ పండుగకు నక్షత్రమండలానికి ఎంతో సంబంధం వున్నది. ఉదాహరణకు ప్రతీ సంవత్సరం మనం భాద్రపద శుద్ధ చవితినాడు జరుపుకునే వినాయకచవితినే గమనిద్దాము. ఆకాశంలో వున్న అనేక నక్షత్ర మండలాలలో వినాయక మండలం ఒకటి. ఈ మండలం ఆశ్లేష నక్షత్రానికి పక్కన, సప్తర్షి మండలానికి ముందుగాను వుంటుంది. ఈ మండలంలో గల నక్షత్రాల ఆకృతిని పరిశీలిస్తే అవన్నీ కలిపి విఘ్నేశ్వరుని రూపంలో కనిపిస్తాయి. ప్రతీ సంవత్సరం భాద్రపద శుద్ధ చవితిరోజున ఈ విఘ్నేశ్వర రూపంలోని నక్షత్ర మండలం సూర్యోదయంకన్నా ముందుగా తూర్పు ఆకాశంలో ఉదయిస్తుంది. అందువలననే మనం ఆ రోజున వినాయకచవితిని జరుపుకుంటాము. మరో విశేషమేమిటంటే ఈ వినాయకమండల నక్షత్రాలు ఆశ్లేష పక్కగా వుండటం వలన వినాయకుడు నాగ యజ్ఞోపవీతుడు అయ్యాడు.

కృత్తికా నక్షత్రంలో సూర్యుడు సంచరించడాన్ని కర్తరి అంటారు. ఈ సమయంలో సూర్యుడు భూమి సంచరించే కక్షలో అతి దగ్గరగా వుండుటవలన అత్యధికమైన వేడి వుంటుంది. అందుకే కృత్తికా నక్షత్రానికి అగ్ని అధిదేవతగా నిశ్చయించబడినాడు. ఇంత వేడి వున్న రోజులలో గృహ నిర్మాణం మంచిది కాదు కాబట్టి ఆ రోజుల్లో మానవులెవరూ గృహ నిర్మాణం చేపట్టరాదని సూచించబడింది.

ఈవిధంగా నక్షత్రాలకు, భూమిమీద మానవ జీవితానికి ఎంతో సంబంధం వుంది. ఒక్కొక్క నక్షత్రానికి ఒక్కొక్క కథతో ఈ పుస్తకం వ్రాయడం జరిగింది. ఏ నక్షత్రం నాడు ఆ నక్షత్రపు కథ చదువుకుంటే ఎంతో శుభప్రదం. ఈ పుస్తకం పూర్తిగా శ్రీనివాసుని అనుగ్రహం తప్ప మరొకటి కాదు.

ఈ సమస్త విశ్వం శ్రీమన్నారాయణుని స్వరూపమే. ఆ శ్రీమన్నారాయణుడే నేడు తిరుమలలో శ్రీనివాసునిగా వెలసి భక్తులందరినీ అనుగ్రహిస్తున్నాడు. ఆ శ్రీనివాసుని దయవలననే నేను ఇంతకుముందు అయిదు పుస్తకాలు రచించడం జరిగింది. ఈ ప్రస్తుత రచన కూడా శ్రీనివాసుని అనుగ్రహమే తప్ప మరొకటి కాదు.

ఆ శ్రీనివాసుని లీలలు అద్భుతం, నమ్మిన వారికి కొంగుబంగారం, అనంతుడు, ఆపద మొక్కులవాడు. తరతరాలుగా స్వామి తనను నమ్మిన వారిని రక్షిస్తూ వారికి ముక్తిని ప్రసాదిస్తున్నాడు.

ఆ శ్రీనివాసునికి తన భక్తులంటే అత్యంత ప్రేమ. మనం అహంకారాన్ని, ఈ ఇహలోక విషయాలపై మమకారాన్ని వదిలి ఆ స్వామిని ప్రార్థిస్తే అన్నీ తనే చూసుకుంటాడు. కలియుగంలో ఇంతకుమించిన దైవం మరొకరు లేరు. ఇందువలననే తిరుమలను రోజూ కొన్ని వేలమంది దర్శిస్తూ, స్వామివారిని సేవిస్తున్నారు.

నా రచనలన్నీ వ్రాసింది నేనైనా నాచే వ్రాయించింది ఆ స్వామివారే... కేవలం కలం మాత్రం నేను పట్టుకున్నాను. అంతే... సాక్షాత్తూ స్వామివారే ప్రతి అక్షరానికి ప్రేరణ, ప్రతీ పదం శ్రీనివాసుని అనుగ్రహమే.

శ్రీనివాసుని లీలలు అద్భుతం, ఆ స్వామిని మనసారా కొలిస్తే అంతటి మహత్తర దేవుడు మరొకరు మనకు కనబడరు. శ్రీ వేంకట తత్వాన్ని అర్థం చేసుకుంటే అంతకు మించిన బ్రహ్మానందం మరొకటి ఉండదు.

ఈ పుస్తకం రచిస్తున్నప్పుడు ఎందరో మహానుభావుల గ్రంథాలు, ఎంతగానో నాకు తోడ్పడ్డాయి. అలాగే ఈ పుస్తక ప్రచురణలో ఎంతోమంది సహకరించారు. వారందరికీ పేరుపేరున నా నమస్కారాలు. అలాగే ఈ గ్రంథ రచన సాదాంతం నా సహధర్మచారిణి చి॥ల॥సౌ॥ శ్రీమతి వేంకట రుక్మిణీ వైదేహి, చిరంజీవులు ఆనంది, ఆముక్త, ఆదిత్య శ్రీనివాస్‌లు ఎంతో సహకరించారు. ఈ పుస్తకాల ప్రచురణలోనూ, అందరికీ చేరటంలోనూ ఎంతో సహాయ సహకారాలందిస్తున్న శ్రీ రమణమూర్తి, శ్రీ శ్రీనివాస మూర్తి సోదరులకు ఎంతో కృతజ్ఞుడ్ని. వీరికీ, ఈ పుస్తకాన్ని, కవర్ చిత్రాలను ఎంతో అందంగా డి.టి.పి. చేసిన శ్రీ వాసవీ గ్రాఫిక్స్, శ్రీమతి & శ్రీ పి.జగదీష్‌కు శ్రీలక్ష్మీశ్రీనివాసుల అనుగ్రహం ఎల్లప్పుడూ ఉండాలని ప్రార్థిస్తున్నాను.

ఇంతటి భాగ్యాన్ని ఇచ్చిన ఆ పరబ్రహ్మ మూర్తికి ఇవే నా ప్రణామములు. ఎల్లప్పుడూ ఆ శ్రీవారి సేవలోనే గడుపుతాననీ, శ్రీ వేంకట తత్వాన్ని ప్రజలందరి హృదయాలకు చేరువగా తీసుకువెళ్లడమే నా జీవిత గమ్యం అని ఆ స్వామివారికి విన్నవించు కుంటున్నాను.

ఈ పుస్తక రచనకు ప్రత్యక్షంగాను, పరోక్షంగానూ సహకరించిన ప్రతి ఒక్కరికి సకల ఆయురారోగ్య సౌభాగ్యాలు కలగాలని ఆ శ్రీలక్ష్మీ శ్రీనివాసులను ప్రార్థిస్తున్నాను.

సర్వేజనా సుఖినోభవంతు ః

శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్

శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళం

తిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తి

హైదరాబాద్.

# ఈ పుస్తకం ఎలా చదవాలి?

ఈ విశ్వం మొత్తం శ్రీమన్నారాయణుని స్వరూపమే నిండి ఉన్నది. 'విష్ణువు' అంటే సర్వ వ్యాపకుడు అని అర్థం. సూర్య చంద్రులు, ఆకాశంలో మనకు కనపడే అనేక గ్రహాలు, నక్షత్రాలు అన్నీ ఆ పురుషోత్తముని స్వరూపంలోనివే. పురాణాలలో ఎన్నో చోట్ల శ్రీమన్నారాయణులవారి విరాట్ స్వరూపం గురించి చక్కగా వివరించబడింది.

ఆకాశంలో అనేక నక్షత్రమండలాలు ఉన్నాయి. వాటిలో రవి మార్గంలో వచ్చే 27 నక్షత్రాలే అశ్విని నుంచీ రేవతి వరకు వచ్చే నక్షత్ర సమూహం. చంద్రునికి ఏ నక్షత్రం దగ్గరగా ఉంటే ఆ రోజు ఆ నక్షత్రానికి చెందినదిగా వ్యవహరిస్తారు. ఈ ఇరవై ఏడు నక్షత్రాలు కూడా అనేక ఆకృతులను కలిగి ఉంటాయి. ఇవి కూడా ఒక్కొక్క నక్షత్రాలు కావు. అశ్విని అంటే గుర్రపు ముఖం ఆకారంలో కనబడే మూడు నక్షత్రాల సమూహం. అలాగే భరణి అంటే రెండు నక్షత్రాలు. కృత్తిక అంటే ఆరు నక్షత్రాల సమూహం. కృత్తికలో జన్మించినవాడే షణ్ముఖుడైన కుమారస్వామి.

ఈ నక్షత్రాల ప్రభావం మానవులపై ఎంతో ఉంటుంది. ఒక్కో నక్షత్రం నాడు జన్మించిన వారి గుణగణాలు, అలవాట్లు, నడవడిక ఒక్కోలా ఉంటాయి. ప్రతీనక్షత్రానికి ఒక్కో అధిదేవత ఉంటుంది. పూర్వకాలంలో ఎవరైనా జన్మిస్తే, ఆ సమయంలో ఉండే నక్షత్రానికి చెందిన అక్షరం ప్రకారం, ఆ అక్షరాలతో ప్రారంభమయ్యేలా నామకరణం చెయ్యడం జరిగింది. ప్రస్తుత కాలంలో ఈ సంప్రదాయం చాలా తగ్గినట్లు కనిపిస్తున్నది. నిజానికి ఆవిధంగా పేరు పెట్టుకొనడం చాలా శ్రేయస్కరం. ఉదాహరణకు అశ్వినిలో పుట్టినవారు చూ, చే, లో, ల అనే అక్షరాలతో ప్రాంభమయ్యేలా నామం పెట్టుకుంటే మంచిది. ఆ అక్షర ఉచ్చారణ వలన వచ్చే శబ్ద తరంగాలు వారిని ఎల్లప్పుడూ కాపాడుతూ ఉంటాయి. అక్షర మంటే క్షరము కానిది. నక్షత్రమంటే కూడా నశించనది అని అర్థం. ఇలా ప్రతీ అక్షరానికీ, ప్రతీ నక్షత్రానికీ అద్భుతమైన శక్తి వున్నది. ఈ విశ్వం మొత్తం ఎంతో తేజోవంతమైన కాస్మిక్ తరంగాలతో నిండి ఉంది. ఇప్పటిదాకా ఏ శాస్త్రజ్ఞులకూ అందని ఎన్నో దివ్యతరంగాలు ఈ విశ్వంలో నిత్యం ప్రసరిస్తున్నాయి.

ఈ పుస్తకం సాక్షాత్తూ శ్రీమన్నారాయణుని అనుగ్రహంతోనూ, సప్తఋషుల వంటి తేజోసంపన్నుల అనుగ్రహంతోనూ రాయబడింది. ఈ పుస్తక రచన సాగుతున్నప్పుడు నక్షత్ర మండలాలలోని ఎంతోమంది దివ్యపురుషులు దర్శనమిచ్చారు. ఈ రచన మొత్తం వారి అనుగ్రహంతో, ఆ దేవర్షుల పర్యవేక్షణలో జరిగినదే. ఈ పుస్తకంలోని ప్రతీ అక్షరం శ్రీనివాసుని అనుగ్రహమే తప్ప మరొకటి కాదు.

ప్రతీ అధ్యాయం ఆ శ్రీనివాసుని దివ్య గుణాలను, దివ్య లీలలను ప్రస్తుతించేదే. అలాగే ప్రతీ అధ్యాయంలోనూ అంతర్లీనంగా ఆ నక్షత్రపు మంత్రానికి చెందిన అక్షరాలు నిక్షిప్తమై ఉన్నాయి. అంతేకాక శ్రీమన్నా రాయణులవారికి చెందిన అనేక దివ్యాక్షరాలు ఆ కథలలో దాగి ఉన్నాయి. కాబట్టి ఆ కథలు చదువుతున్నప్పుడు మనకు తెలీకుండానే ఆ దివ్యాక్షరాలన్నీ ఉచ్ఛరిస్తాము. దానివలన మన శరీరంలోని నాడులన్నీ ఎంతో ఉత్తేజితమై, ఆ అక్షరం నుంచి వచ్చే అద్భుతశక్తి తరంగాలు మన శరీరంలో ప్రసరిస్తాయి. దీనివలన మనకు ఎంతో తేజస్సు కలిగి, ఎటువంటి అనారోగ్యమైనా ఇట్టే

మాయమయిపోతుంది. ఎంతో తేలికగా కనపడే ఈ కథల వెనుక అంతర్లీనంగా ఎన్నో దేవ మంత్రాలు, దేవ రహస్యాలు ఉన్నాయి. అందువలననే ఈకథలు చదివేటప్పుడు మన మనస్సుకు ఎంతో ప్రశాంతంగా, శరీరమంతా ఏదో తెలియని ఆనందంతో నిండి ఉంటుంది.

ఈ పుస్తకాన్ని అశ్విని నక్షత్రం నాడు మొదలుపెట్టి, ఏ నక్షత్రం రోజున ఆ నక్షత్రం యొక్క అధ్యాయము చదువుతూ 27 రోజులలో పూర్తి చెయ్యవచ్చును. దీనివలన సర్వ సౌభాగ్యాలూ, సర్వ సంపదలూ కలుగుతాయి. ఎటువంటి అనారోగ్యమైనా తక్షణం నయమవుతుంది. ఈ పుస్తకం చదివేటప్పుడు ఎటువంటి నియమ నిష్టలూ అవసరం లేదు. ఎవరివీలునుబట్టి వారు ఏ వేళలోనైనా, ఏ రీతిలోనైనా చదువుకొనవచ్చును.

ప్రతీవారు ప్రతీనెలా వారి జన్మనక్షత్రం నాడు ఆ నక్షత్రపు అధ్యాయాన్ని చదివితే చాలా మంచిది. అలాగే ఏదైనా శుభకార్యాలు తలపెట్టినప్పుడు అప్పటి నక్షత్రపు కథను చదువుకొనవచ్చును. జన్మనక్షత్రం తెలియనివారు వారిపేరులోని మొదటి అక్షరానికి వచ్చే నక్షత్రానికి చెందిన అధ్యాయం చదువుకొనవచ్చును. అలాగే ఏదైనా ప్రయాణం తలపెట్టినప్పుడు, ఆ సమయానికి గల నక్షత్రం యొక్క కథ చదువుకున్నట్లయితే ఆ ప్రయాణం శుభప్రదంగా జరగుతుంది.

ప్రతీ ఏకాదశి, పౌర్ణమి రోజులలో ఆనాటి నక్షత్రపు కథను చదివిన యెడల సర్వసౌభాగ్యాలూ సమకూరుతాయి. ఎటువంటి అనారోగ్యము దరిచేరదు. ప్రతిరోజు ఆ రోజు యొక్క నక్షత్రం అధ్యాయాన్ని ఉదయమే చదువుకుంటే ఆ రోజంతా శుభప్రదంగా గడుస్తుంది. ఎవరైనా అనారోగ్యంతో ఉన్నప్పుడు వారు చదవలేని పక్షంలో, వారి నక్షత్రానికి చెందిన అధ్యాయాన్ని వారి బంధుమిత్రులు ఎవరైనా చదివినా కూడా అనారోగ్యం నుంచి త్వరగా ఉపశమనం కలుగుతుంది. ఒకవారం రోజులు ఈవిధంగా చదవగానే పూర్తి ఆరోగ్యవంతులవుతారు.

మీకు వీలున్న ఏ రోజైనా, ఏ రీతిలోనైనా చదివి శ్రీనివాసుని అనుగ్రహంతో సంపూర్ణ ఆరోగ్యంతో, సర్వ సంపదలతో కలకాలం సుఖముగా జీవించవచ్చును.

**శ్రీ లక్ష్మీ శ్రీనివాస కటాక్ష సిద్ధిరస్తు !**

– తిమ్మరాజు విశ్వపతిరామకృష్ణమూర్తి.

# నామ, నక్షత్ర పొంతనములు

జన్మ నక్షత్రము తెలియనివారు కింద పట్టిక ప్రకారము వారి పేరులో మొదటి అక్షరానికి వచ్చే నక్షత్రమునకు సంబంధించిన అధ్యాయం చదువుకొనవలెను.

| | అక్షరాలు | నక్షత్రం |
|---|---|---|
| 1. | చూ చే చో ల | అశ్విని |
| 2. | లీ లూ లే లో | భరణి |
| 3. | ఆ ఈ ఊ ఏ | కృత్తిక |
| 4. | ఓ వా వీ వూ | రోహిణి |
| 5. | వే వో కా కి | మృగశిర |
| 6. | కూ ఖ జ ఛ | ఆర్ద్ర |
| 7. | కే కో హా హీ | పునర్వసు |
| 8. | హూ హే హో డా | పుష్యమి |
| 9. | డి డూ డే డో | ఆశ్లేష |
| 10. | మా మీ మూ మే | మఖ |
| 11. | మో టా టీ టూ | పుబ్బ |
| 12. | టే టో పా పీ | ఉత్తర |
| 13. | పూ ష ణ ఢ | హస్త |
| 14. | పే పో రా ర | చిత్ర |
| 15. | రూ రే రో త | స్వాతి |
| 16. | తి తూ తే తో | విశాఖ |
| 17. | నా నీ నూ నే | అనూరాధ |
| 18. | నో యా యీ యూ | జ్యేష్ఠ |
| 19. | యే యో బా బీ | మూల |
| 20. | బూ ధా భా ఢా | పూర్వాషాఢ |
| 21. | బే బో జా జీ | ఉత్తరాషాఢ |
| 22. | ఖీ ఖూ ఖే ఖో | శ్రవణం |
| 23. | గా గీ గూ గే | ధనిష్ఠ |
| 24. | గో సా సీ సూ | శతభిషం |
| 25. | సే సో దా దీ | పూర్వాభాద్ర |
| 26. | దు శం ఛా ధా | ఉత్తరాభాద్ర |
| 27. | దే దో చా చీ | రేవతి |

* * *

# అంకితము

నా పితామహులు కీ॥శే॥ బ్రహ్మశ్రీ తిమ్మరాజు కృష్ణా రావు, సుబ్బలక్ష్మి దంపతులు, నా మాతామహులు కీ॥శే॥ బ్రహ్మశ్రీ భోగరాజు రామకృష్ణమూర్తి, సామ్రాజ్య లక్ష్మి దంపతుల ప్రీత్యర్థముగా తిరుమల శ్రీ శ్రీనివాసుని దివ్య చరణారవిందములకు నా ఈ "భజే శ్రీనివాసమ్" గ్రంథమును భక్తితో సమర్పిస్తున్నాను.

**విశ్వపతి**

# అశ్వని

నక్షత్రాలన్నింటిలోకి మొదటిది అశ్వని. ఈ నక్షత్రానికి అశ్విని దేవతలు అధి దేవతలు. ఈ నక్షత్రంలోని నాలుగు పాదాలు మేషరాశికి చెందుతాయి. అశ్వని నక్షత్రం నాడు శ్రీనివాసుని దర్శించడం వలన సంపూర్ణ ఆరోగ్యం సిద్ధిస్తుంది. దేవతల వైద్యుడైన ధన్వంతరి శ్రీమన్నారాయణుడే. శ్రీమన్నారాయణుని అశ్వనీ నక్షత్రం రోజున ఎవరు ఆరాధిస్తారో వారికి ఎటువంటి అనారోగ్యం నుంచైనా వెంటనే ఉపశమనం కలుగుతుంది.

పూర్వకాలంలో కోసల దేశంలో రేవంతుడనే రాజు ఉండేవాడు. రేవంతునికి పూర్వ జన్మ కర్మ ఫలితంగా ఒక విచిత్ర రోగం పట్టుకున్నది. పగలు ఎంతో చలాకీగా ఉండే రేవంతునికి సూర్యాస్తమయం కాగానే కంటిచూపు మందగించేది. చెవులకు ఏమీ వినిపించేది కాదు. తల తిరుగుతున్నట్లుగా ఉండేది. ఏవో పిచ్చి పిచ్చి ఆలోచనలు వచ్చి తాను ఎవరో కూడా మరిచిపోయేవాడు. రాత్రంతా నిద్ర లేక అంత:పురం అంతా పిచ్చివాడిలా తిరిగేవాడు. తెల్లవారగానే తిరిగి మామూలు మనిషి



అయ్యేవాడు. ఈ వ్యాధి ఏమిటో ఎవరికీ అంతు చిక్కలేదు. రాజవైద్యులు చెయ్యని చికిత్స లేదు. ఈ వ్యాధి అంతు పట్టక రాణి ఎంతో దు:ఖించి ఎన్నో దేవతలకు మొక్కుకున్నది. అయినా ఫలితం లేకపోయినది. రాజు తన ఈ వింత వ్యాధి పోగొట్టినవారికి అర్ధరాజ్యం ఇస్తానని చాటించాడు. దేశం నలుమూలల నుండి ఎందరో గొప్ప వైద్యులు వచ్చి ఎన్నో రకాల వైద్యం చేసినా ఏ మాత్రం ఫలితం లేకపోయింది.

రోజులు ఇలా గడుస్తుండగా ఒకనాడు ఆ రాజ్యానికి ఒక సాధువు వచ్చాడు. పగలంతా శిష్యులతో సంచారం చేసి రాత్రికి ఒక పెద్ద చెట్టుకింద విశ్రమించాడు. అటుగా పోతున్న బాటసారులు కొంతమంది ఆ రాత్రికి ఆ చెట్టుకిందనే గడుపుదామని వచ్చారు. ఆ బాటసారుల మాటలు కొన్ని సాధువు చెవిన పడ్డాయి. ఆ దేశపు రాజైన రేవంతుడు ఎంతకీ అంతు చిక్కని విచిత్ర వ్యాధితో బాధ పడుతున్నట్లుగా గ్రహించాడు. ఆ రాజు వ్యాధి తగ్గే మార్గం తన దగ్గర ఉన్నదని గ్రహించిన సాధువు మరుసటి రోజు రాజాస్థానానికి చేరుకున్నాడు. తను వచ్చిన సంగతి వివరించాడు. తాను రాజుయొక్క వ్యాధి తప్పక నయం చేయగలనని మంత్రితో చెప్పాడు. అయితే అతని మాటలను ఎవరూ నమ్మలేదు. ఎందరో గొప్ప వైద్యులకు సాధ్యం కానిది ఈ సామాన్య సాధువు వలన అవుతుందా అని తలచారు.

కానీ రాణి మాత్రం ఏ పుట్టలో ఏ పాముందోనని తలచి సాధువుతో "స్వామీ! తమరి రాక మాకెంతో సంతోషం, దయచేసి నా నాథుడి వ్యాధి నయమయ్యే దారి చెప్పవలసింది" అని వేడుకుంది. అంతట ఆ సాధువు ఒకసారి కళ్ళు మూసుకుని ధ్యానించి 'అమ్మా! నేను చెప్పినట్లుగా చేస్తే ఈ వ్యాధి తప్పక నయమవుతుంది. ఈ వ్యాధే కాదు, ఎంతటివ్యాధైనా సరే తప్పక నయమవుతుంది. నీవు చేయవలసిందల్లా ఒక్కటే! రాజును నీ వెంట పెట్టుకుని వేంకటాద్రి చేరి అశ్వనీ నక్షత్రం నాడు పుష్కరిణిలో

స్నానమాచరించి, వరాహ స్వామిని దర్శించి అటు తర్వాత ఆనంద నిలయంలోని శ్రీనివాసుని దర్శించవలసింది. ఆ మరుదినమే రాజు పూర్తి ఆరోగ్యవంతుడౌతాడు. నేటికి ఏడవరోజునే అశ్వనీ నక్షత్రం. ఇక ఆలస్యం చేయక రేపే ప్రయాణ ఏర్పాట్లు చేసుకుని తిరుమల యాత్ర చేయవలసింది అని చెప్పాడు.

ఇదంతా సావధానంగా విన్న రాణి ఆ సాధువునికి నమస్కరించి తగు రీతిన సత్కరించి పంపింది. సాధువు చెప్పినట్లుగానే వెంటనే ప్రయాణపు ఏర్పాట్లు ప్రారంభించి అశ్వనీ నక్షత్రానికి ఒకరోజు ముందుగానే తిరుమలకు చేరుకున్నారు. మరునాడు సూర్యోదయం కాగానే రాజు, రాణి ఇద్దరూ స్వామి పుష్కరిణిలో స్నానమాచరించి, వరాహ స్వామిని దర్శించి తరువాత ఆనంద నిలయంలో శ్రీ స్వామివారిని దర్శించారు. స్వామిని తమను అనుగ్రహించవలసిందిగా అనేక విధాల ప్రార్థించారు. ఆ రోజు రాత్రి కొండమీదనే విశ్రమించదలచారు. సూర్యాస్తమయం దగ్గర పడుతున్న కొద్దీ రాణి మనసులో అలజడి ప్రారంభమైంది. ఈ రాత్రి తన నాథుడు ఎలా వుంటాడో అని ఎంతో బాధపడింది. ఇంతలోనే సాయంత్రం అయ్యింది. రాజు నవ్వుతూ కులాసాగా వున్నాడు. రాత్రి చీకటి కాసాగింది. రాజులో వ్యాధి లక్షణాలు ఎక్కడా లేవు. ఆ రాత్రి రాజు పూర్తి ఆరోగ్యవంతుడిలా వున్నాడు. రాజు వ్యాధి పూర్తిగా నయమైందని గ్రహించిన దంపతుల ఆనందానికి అవధులు లేవు.

తెల్లవారగానే ఆ రాజ దంపతులిద్దరూ ఆలయానికి వెళ్ళారు. వారు ఆనంద నిలయం చేరేటప్పటికి అక్కడ వున్న అర్చకులు ఎంతో కమనీయ స్వరంతో స్వామికి సుప్రభాతసేవ చేస్తున్నారు. ఆ సమయంలో శ్రీనివాసుని అద్భుత దివ్య మంగళ స్వరూపం చూసిన రాజ దంపతుల ఆనందానికి



అవధులు లేవు. ఈ సృష్టిలోని అందం అంతా ఆ స్వామిదే. ఈ విశ్వంలోని తేజస్సంతా ఆ పరబ్రహ్మమూర్తిదే. ఈ జగత్తులోని ఆనందమంతా స్వామిలోనే వున్నది. ఇలా స్వామి గుణగణాలను తలుస్తూ రాజదంపతులిద్దరూ చేతులు జోడించి స్వామికి నమస్కరిస్తూ నిల్చున్నారు. సుప్రభాతసేవ పూర్తికాగానే అక్కడ వున్న అర్చకులతో రాజుయొక్క అనారోగ్యము, తిరుమల యాత్రతో స్వామి అనుగ్రహంతో రాజు అనారోగ్యం పూర్తిగా నయమవటం తెలిపారు. అప్పుడు అర్చకులు ఆ రాజుతో మహారాజా! ఈ శ్రీనివాసుడు భక్త వత్సలుడు. తనను నమ్మినవారికి సర్వం అనుగ్రహించే అమృతమూర్తి. ఆ స్వామిని జీవితాంతం కొలచి మీ జన్మను సార్థకం చేసుకొనవలసింది అని అన్నారు.

అప్పుడు రాజదంపతులిద్దరూ "ఓ శ్రీమన్నారాయణా! శ్రీనివాసా! నీవు భక్త సులభుడవు. నిన్ను నమ్మినవారికి సర్వం అనుగ్రహించే అమృతమూర్తివి. ఈ సృష్టిలో నిన్ను మించిన దైవం లేదు. నీకివే మా నమస్కారాలు". అని పరిపరివిధాల ప్రార్థించి తిరిగి రాజ్యానికి పయనమై కలకాలం సుఖంగా జీవించారు.

అశ్వనీ నక్షత్రం నాడు స్వామిని దర్శించినవారికి సంపూర్ణ ఆరోగ్యంతోపాటు, ఐశ్వర్యమూ కలుగుతుంది. ఎటువంటి అనారోగ్యమైనా క్షణంలో మాయమౌతుంది. ఎంతటి దీర్ఘవ్యాధులైనా అశ్వనీ నక్షత్రంనాడు శ్రీ స్వామిని దర్శించటం వలన వెంటనే నయమవుతాయి.

ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "*

# భరణి

నక్షత్ర సమూహంలో రెండవదైన భరణీ నక్షత్రానికి అధిపతి యమధర్మరాజు. మేష రాశికి చెందిన భరణీ నక్షత్ర సమయంలో తిరుమల శ్రీనివాసుని దర్శించినవారికి అకాల మృత్యు భయం వుండదు. సంపూర్ణ ఆయుర్దాయంతో కలకాలం జీవించి చివరన ముక్తిని పొందుతారు. మేషరాశికి అధిపతి కుజుడు. కుజుని ఆరాధనతో ఎటువంటి ఆర్థిక బాధలైనా తొలగిపోతాయి.

పూర్వకాలంలో గౌతముడు అనే మహా తపస్వి వుండేవాడు. ఎంతో మహా తపస్సంపన్నుడైన గౌతమునికి మరణానంతరం ఉత్తమ లోకాలు పొందాలనే ఆలోచన కలిగింది. దీనికోసం ఏంచేయాలా అని తలచి చివరికి "విశ్వజిత్" అనే మహాయాగం చేయడానికి సంకల్పించాడు. యాగం భారీ ఎత్తున ప్రారంభమైంది. ఎంతో నియమ నిష్ఠలతో కొన్ని రోజులపాటు కొనసాగిన ఈ యాగం చివరి దశకు వచ్చింది. శాస్త్ర ప్రకారం యాగం ఆఖరిరోజున దానాలు చేయవలసి వున్నది. గౌతముడు అనేక దానాలు



చేశాడు. ఇక గోదానం మాత్రం చేయవలసి వున్నది. అప్పుడు గౌతముని కుమారుడు నచికేతుడు ఒక విషయం గమనించాడు. తన తండ్రి గోశాలలో గోవులన్నీ ఏ మాత్రం ఓపిక లేనివై వున్నాయి. ఇటువంటి గోవులను సద్బ్రాహ్మణులకు దానం చేస్తే పుణ్యం రాకపోగా పాపం వస్తుందని నచికేతుడు తలచాడు. ఏవిధంగానైనా ఈ గోదానాన్ని మాన్పించాలని తలచాడు. వెంటనే తండ్రిదగ్గరకు వెళ్ళి తండ్రీ! ఈ యాగం ఎంతో గొప్పగా నిర్వహిస్తున్నావు. ఇన్ని రకాల దానాలను సద్బ్రాహ్మణులకు చేయటం చూస్తున్నాను. చాలా సంతోషం. మరి నన్నెవరకు దానం ఇస్తున్నావు? అని అడిగాడు.

ఇది విన్న గౌతముడు నచికేతుని విసుక్కుని 'నీకేమైనా పిచ్చి పట్టిందా? నిన్ను దానం ఇవ్వడమేమిటి? ఇక్కడ్నుంచి వెళ్లి నీ పని చూసుకో! అని కసురుకున్నాడు. నచికేతుడు అక్కడినించి వెళ్లిపోయి, కాసేపటికి మళ్ళీ తండ్రి దగ్గరకు వచ్చాడు. మళ్ళీ ఇదే ప్రశ్న. 'తండ్రీ నన్నెవరికి దానం ఇస్తున్నావు?' అని అడిగాడు. ఈసారి గౌతమునికి మరింత విసుగొచ్చింది. నిన్నెవరికీ దానం ఇవ్వటంలేదని చెప్పాను గదా! ఇంక ఈ పక్కకు రాకు! వెళ్లి నీ పని చూసుకో! అని అరిచి పంపించాడు.

నచికేతుడు కాసేపు అటూ ఇటూ తిరిగి మళ్ళీ తండ్రి దగ్గర ప్రత్యక్షమయ్యాడు. 'నన్ను ఎవరికి దానం ఇస్తున్నావు తండ్రీ!' అంటూ మళ్ళీ అదే ప్రశ్న వేశాడు. ఇది విన్న గౌతముడికి విపరీతమైన కోపం వచ్చింది. ఓపిక నశించి విసుగ్గా నచికేతునితో 'నిన్ను యమధర్మరాజుకి దానం ఇస్తున్నాను!' అన్నాడు. ఇలా అనగానే యమధర్మరాజు ప్రత్యక్షమయ్యాడు. నచికేతుని తనతో తీసుకువెళ్లడానికి సిద్ధమయ్యాడు.

అప్పుడు నచికేతుడు యమునికి నమస్కరించి, ఆత్మ స్వరూపము, జన్మ జన్మల రహస్యము చెప్పవలసిందిగా ఆయనను అడిగాడు. ఇది ఎటువంటి పరిస్థితులలోను చెప్పకూడదని యమధర్మరాజు అన్నాడు. అటు తరువాత వీరిద్దరికీ అనేక ధర్మసూక్ష్మాలపై చర్చ జరిగింది. చివరికి యముడు నచికేతుని అపార విద్యావంతునిగా గ్రహించి అతనికి బ్రహ్మోపదేశం చేస్తూ ఇలా అన్నాడు. 'నచికేతా! నీ అద్భుత జ్ఞాన సంపదకు సంతోషించాను. వేదాలన్నీ దేని గురించి చెపుతున్నాయో, సర్వ దేవతా గణమూ దేనిని ఎల్లవేళలా ఉపాసిస్తూ ఉన్నారో, సమస్త ముని గణమూ దేనిని ఎల్లప్పుడూ స్మరిస్తూ ఉంటారో అదే ఓంకారము. అదే పరబ్రహ్మ స్వరూపము. ఎవడైతే సర్వకాల సర్వావస్థలయందునూ ఓంకారాన్ని మనస్సులో ఉచ్చరిస్తూ ఉంటాడో వాడు బ్రహ్మతత్వాన్ని పొందగలడు.

ఓంకారము అగ్ని, వాయు, సూర్య స్వరూపములతో ప్రకాశించుచున్నది. బ్రహ్మ, విష్ణు, రుద్ర రూపములకు అధిపతిగా వున్నది. భూలోక, భువర్లోక, సువర్లోకములు మూడు ఓంకార లోకములే! భూత, భవిష్యత్, వర్తమాన కాలములు మూడూ ఓంకార కాలత్రయము. ఓం కారమే సర్వవ్యాపి, అదే అనంతము. అనంతమే తారక రూపము. అదియే సూక్ష్మరూపము. సూక్ష్మ రూపమే శుక్లము, అదియే తేజోరూపము. ఆ తేజస్సే పరబ్రహ్మ స్వరూపము. ఓం కారములోనే ఈ విశ్వమంతయు ప్రకాశించుచున్నది. ఓంకారము మంగళ స్వరూపము, కాబట్టి సమస్త మంగళములను ప్రసాదించును.

జీవులందరి హృదయాలలో పరమాత్మ స్వరూపంలో వున్నది ఆ పరబ్రహ్మమూర్తియే. ఆత్మకు చావు పుట్టుకలు లేవు. శరీరం నశిస్తుంది, తప్ప ఆత్మ నశించదు. ఆత్మ కన్నా సూక్ష్మమైనది ఈ సృష్టిలో లేదు అంటూ వివరించాడు.



ఆ పరబ్రహ్మ మూర్తియే శ్రీమన్నారాయణుడు, అతడే శ్రీనివాసుడు. ఓంకార స్వరూపుడైన శ్రీనివాసుని ఎవరైతే ఎల్లవేళలా తలుస్తూ వుంటారో వారికి బ్రహ్మజ్ఞానం లభిస్తుంది. మృత్యు భయం వుండదు. ఎటువంటి ఆపదలూ దరి చేరవు. శ్రీనివాసుని నిత్యం స్మరించేవారికి సర్వసౌభాగ్యాలు సమకూరుతాయి, సర్వ సంపదలూ కలుగుతాయి.

ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "*

# కృత్తిక

కృత్తిక నక్షత్రం మొదటి పాదం మేషరాశిలోనికి, మిగిలిన మూడు పాదాలూ వృషభరాశిలోని వస్తాయి. కృత్తిక నక్షత్రానికి అధిష్టానదేవత అగ్ని. మేషం అంటే గొర్రె అని అని అర్థం. ఇది అగ్నికి వాహనం. అగ్ని మేషారూఢుడై సంచరిస్తాడు. యజ్ఞాలన్నింటిలోనూ హవిస్సులను అగ్నికి ధారపోస్తారు. యజ్ఞోవై విష్ణుః అంటుంది వేదం. అంటే యజ్ఞం విష్ణు స్వరూపమే అని అర్థం. పంచ భూతములందు ఆవరించి ఉన్నది ఆ శ్రీమన్నారాయణుడే. ఈ పంచభూతాలన్నింటిలోనూ ఉంటూ వాటిని నియంత్రించేది కూడా ఆ స్వామియే.

కృత్తిక ఆరు నక్షత్రాల సముదాయం. అందుకే ఆరు ముఖాలతో ఈ నక్షత్రంలో జన్మించిన శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుడు కార్తికేయునిగా కొలవబడుతున్నాడు. షణ్ముఖునికి జన్మ నక్షత్రమైన ఈ కృత్తిక నక్షత్రంలో తిరుమల శ్రీనివాసుని దర్శించినవారికి సర్వ సౌభాగ్యాలు కలుగుతాయి. పూర్వకాలంలో శ్రీనివాసుని సుబ్రహ్మణ్యేశ్వరునిగా కూడా ఆరాధించడం



జరిగింది. చేతులకు నాగాభరణాలు ఉండడంతో ఆ స్వామిని కార్తికేయునిగా ఆరధించేవారు. ఇప్పటికీ తమిళనాడులోని కొందరు భక్తులు స్వామిని సుబ్రహ్మణ్యేశ్వరునిగానే కొలుస్తున్నారు.

పూర్వకాలంలో విష్ణుభట్టు, కృష్ణభట్టు అనే ఇద్దరు బ్రాహ్మణ సోదరులు ఉండేవారు. పెద్దవాడైన విష్ణుభట్టు సకల విద్యా పారంగతుడు. అన్ని వేదాలను క్షుణ్ణంగా అభ్యసించినవాడు. దురదృష్టంకొద్దీ చిన్నవాడైన కృష్ణభట్టుకు మాత్రం పెద్దగా చదువు అబ్బలేదు. చిన్న చిన్న పౌరోహిత్యం పనులు చేసుకుంటూ కాలం గడిపేవాడు. సంసార భారాన్ని మోయటం చాలా కష్టంగా ఉండేది.

పెద్దవాడైన విష్ణుభట్టుకు అన్ని విద్యలూ తనకే తెలుసునని అహంకారంగా ఉండేది. ఎల్లప్పుడూ తమ్ముడిని హేళనగా చూసేవాడు. ఈసడించుకునేవాడు. అన్న విష్ణుభట్టుకు రాజాస్థానంలో మంచి స్థానం దొరికింది. రాజు కుటుంబానికి సంబంధించిన పూజలన్నీ విష్ణుభట్టు ఆధ్వర్యంలోనే జరిగేవి. తమ్ముడు కృష్ణభట్టు అన్నతో తనకు కూడా రాజాస్థానంలో ఏదైనా చిన్న ఉద్యోగం చూడమని ఎంతో వేడుకున్నాడు. కానీ విష్ణుభట్టు మాత్రం ఏమాత్రం ఒప్పుకోక “నిన్ను నాతో పాటు రాజాస్థానానికి తీసుకెళితే నా పదవి కూడా పోతుంది” అని విసుక్కునేవాడు.

రోజురోజుకి కృష్ణభట్టుకి తన అన్న చేసే అవమానాలను భరించటం కష్టతరమైనది. తాను సహాయం చేయకపోగా వేరే ఎవరినీ కూడా తన తమ్ముడికి సహాయం చేయవద్దని శాసించేవాడు. రాజాస్థానంలో విష్ణుభట్టుకు గల పలుకుబడికి భయపడి ఎవ్వరూ ఎదురుచెప్పే సాహసం చెయ్యలేకపోయేవారు.

ఈ అవమాన భారాన్ని భరించలేక కృష్ణభట్టు ఒకనాటి అర్ధరాత్రి

ఇంట్లో ఎవ్వరికీ చెప్పకుండా ఊరి విడిచి వెళ్ళిపోయాడు. ఎన్నో రోజులపాటు గ్రామాలన్నీ దాటుతూ చంద్రగిరి ప్రాంతాన్ని చేరుకున్నాడు. తిరుమల కొండ ఎక్కి శ్రీనివాసుని దర్శించి తన బాధలు మొర పెట్టుకోవాలనుకున్నాడు. ఆ స్వామి తప్ప వేరెవరూ తనను రక్షింపలేరని భావించాడు.

కొండ ఎక్కుతున్న భక్తుల గుంపులతో కలిసి ఎక్కి స్వామిని దర్శించుకున్నాడు. ఆనంద నిలయంలో స్వామి అద్భుత సౌందర్యానికి ఆశ్చర్యపోయాడు. కృష్ణభట్టు స్వామిని దర్శించేవేళకు శ్రీనివాసునికి రాత్రి పవళింపుసేవ జరుగుతోంది. స్వామిని అనేక విధాల ప్రార్థించి తనకు జరుగుతున్న అవమానాలను విన్నవించుకున్నాడు. “ఓ శ్రీనివాసా ఈ ప్రపంచంలో నీవు తప్ప నాకెవ్వరూ దిక్కులేరు తండ్రీ! సర్వ ప్రాణికోటినీ రక్షించే నాథుడవు నీవే. నీ అమృతతత్వం తెలుసుకోలేనివారు ఎన్ని శాస్త్రాలు చదివినా వ్యర్థమే. ఈ సృష్టి సమస్తం నీయందే జన్మించి నీయందే లయమగుతున్నది. నీవంతటి భక్త సులభుడు వేరెవరున్నారయ్యా’. భక్తులకు ఏ చిన్న ఆపద కలిగినా, వారు ఈ విశ్వంలో ఎక్కడ ఉన్నా సరే, వారు నిన్ను తలచుకునే ముందే నువ్వు వారిని ఆ ఆపదలనుండి రక్షిస్తావు. నిన్ను అర్చించినవారికి సర్వ సౌభాగ్యాలు దక్కుతాయి. సమస్త దేవతా సమూహము నిన్ను సేవించి తరించడానికి ఉవ్విళ్లూరుతుంటారు. నీ అంతటి అమృతమూర్తి ఈ విశ్వంలో ఎక్కడా కానరారు తండ్రీ. ఓ శ్రీమన్నారాయణా! ఓ ఆర్త జన రక్షకా! ఓ దీనబంధూ! వేదస్వరూపడవు నీవే! సమస్త దేవతలకు వారి వారి శక్తులను ప్రసాదిస్తున్నది నీవే! ఆరాధింపదగ్గపడే వారిచేత ఆరాధింపబడేవాడవు. త్రిసంధ్యలూ నీవే! కాల పురుషుడవు నీవే! ఈ సమస్త సృష్టికి నీవే ఆధారము తండ్రీ ! నన్ను రక్షింపవలసింది! అని ప్రార్థించాడు.



పవళింపుసేవ అయిన తరువాత ఆచార్య పురుషులు స్వామి ముందు వున్న తెరను వేసి, ఆలయ తలుపులు మూసి ఎవరి ఇండ్లకు వారు చేరుకున్నారు. కృష్ణభట్టు ఆ రాత్రి అక్కడే ఒక సత్రంలో పడుకున్నాడు. తెల్లవారింది. లేచి కాలకృత్యాలు తీర్చుకుని పుష్కరిణిలో స్నానం చేసి వడి వడిగా ఆలయంలోనికి ప్రవేశించాడు. ఆలయంలో అర్చక స్వాములు స్వామి సుప్రభాత సేవ మొదలుపెట్టడానికి సిద్ధంగా వున్నారు. ముందుగా ఆనాటి తిథి, వార నక్షత్రాలు చెబుతున్నారు... పాడ్యమి, శుక్రవారం, కృత్తికా నక్షత్రం ... ఇలా చెపుతున్నారు. సుప్రభాతం మొదలైంది. అర్చకస్వాములు ఎంతో దివ్యంగా కౌసల్యా, సుప్రజా, రామా అంటూ సుప్రభాత పఠనం మొదలుపెట్టారు. సుప్రభాతం, వేంకటేశ్వర ప్రపత్తి, మంగళాశాసనం చదివారు. ఇక తరువాతి కార్యక్రమం ప్రబంధ పఠనం, వేద పఠనం ప్రారంభం కావలసి ఉంది. అర్చకస్వాములందరూ ఒకరి ముఖం ఒకరు చూసుకుంటున్నారు తప్ప వేద పఠనం ప్రారంభం కాలేదు. విష్ణుభట్టుతో సహా అక్కడ ఉన్న భక్తులకు ఏమీ అర్థం కావటం లేదు. కాసేపటికి అసలు విషయం తెలిసింది. ఆ రోజు వేదపఠనం గావించవలసిన అర్చకులు ఏదో అనుకోని అవాంతరం వలన ఆలయానికి రాలేదు. ముందుగా తెలుపకపోవటం వలన ఆలయంలోని అర్చకులకు ఈ సంగతి తెలియలేదు. ఈ రోజుకి స్వామికి వేదపఠనం లేనట్లేనా అనుకుంటుండగా ఒక్కసారిగా దివ్యమైన స్వరంతో వేదం మొదలుపెట్టిన వ్యక్తి కనపడ్డాడు. ఎవరా ఈ మహానుభావుడు అని అందరూ ఆశ్చర్యపోయారు. ఆ వ్యక్తి మరెవరో కాదు! కృష్ణభట్టు! అక్కడ వారందరి ఆనందానికి అవధి లేదు. ఎవరో మహా విద్యాసంపన్నుడు వచ్చాడని అందరూ సంతోషపడ్డారు.

కృష్ణభట్టుకు తన ప్రయత్నం ఏ మాత్రం లేకుండానే ఆ వేద ప్రవాహం నోటివెంబడి వస్తున్నది. అదీ స్వామి అనుగ్రహం అంటే ! స్వామి కరుణ ప్రసరించగానే ఒక్కసారిగా సర్వ విద్యలూ కృష్ణభట్టుకి వచ్చాయి. కృష్ణభట్టు ఆ విధంగా కృత్తికా నక్షత్రం నాడు శ్రీనివాసుని అనుగ్రహంతో సకల విద్యా పారంగతుడై తన ఊరికి తిరిగి వచ్చాడు. తమ్ముడికి సర్వ విద్యలూ లభ్యమవ్వడం చూసి అన్న విష్ణుభట్టు ఆశ్చర్యపోయాడు. జరిగినదంతా తెలుసుకుని శ్రీనివాసుని కరుణా కటాక్షాల వల్లనే తన తమ్ముడు ఇంతటి వాడయ్యాడని గ్రహించాడు. తన అహంకారానికి క్షమించవలసిందిగా స్వామిని పరిపరివిధాల వేడుకున్నాడు.

తన తమ్ముడు కృష్ణభట్టుని తీసుకుని రాజాస్థానానికి వెళ్ళి రాజుకు జరిగినదంతా విన్నవించి తన తమ్ముడికి మంచి పదవిని ఇవ్వమని కోరాడు. రాజుకు అందుకు ఒప్పుకుని శ్రీనివాసుని అనుగ్రహం గురించి తెలుసుకుని ఎంతో సంతోషపడి కృష్ణభట్టుకు మంచి పదవినిచ్చి, అనేక కట్న కానుకలిచ్చి సత్కరించాడు. శ్రీనివాసుని నమ్మినవారికి సర్వ ఐశ్వర్యాలు లభిస్తాయి.

ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "*



# రోహిణి

దక్ష ప్రజాపతికి గల 27 మంది కుమార్తెలే తారలు. వీరి భర్త చంద్రుడు, అయితే చాలా కాలం చంద్రుడు తనకు ఎంతో ప్రియమైన రోహిణి వద్దే కాలం గడుపుతూ మిగిలిన తారలను ఉపేక్షించేవాడు. ఇది గ్రహించిన మిగిలిన తారలన్నీ ఎంతో చిన్నబుచ్చుకున్నాయి. అప్పుడు ప్రజాపతి తన కుమార్తెలను బాధపెట్టిన చంద్రుని శపించాడు. ఈ శాప ఫలితంగానే చంద్రుడు 14 రోజులు వెలుగొందుతూ, 14 రోజులు క్షీణిస్తూ ఉంటాడు.

ఈ లోకాన్నంతటికీ చల్లదనాన్ని ప్రసాదించే చంద్రుడు కూడా శ్రీమన్నారాయణుని స్వరూపమే. విష్ణు సహస్రనామాలలో "చంద్రాంశు:" అనే నామం దీనినే సూచిస్తున్నది. "చంద్రాంశు:" అంటే చల్లని కాంతి కలవాడు అని అర్థం. నిరంతరం తననే ఎవరు ఆరాధిస్తూ ఉంటారో వారిని అన్ని బాధలనుండి విముక్తులను చేసి చల్లని ఆనందం కలుగజేసేవాడు

శ్రీమన్నారాయణుడే. తన భక్తులకు ఆహ్లాదాన్ని కలిగించే చంద్రాంశుడు శ్రీమన్నారాయణుడు, అతడే తిరుమల శ్రీ వేంకటేశ్వరుడు.

శ్రీమన్నారాయణులవారు ఈ రోహిణీ నక్షత్రంలోనే శ్రీకృష్ణునిగా అవతరించి దుష్టశిక్షణ, శిష్ట రక్షణ గావించాడు. స్వయంభువు మనుపు కాలంలో 'సుతవుడు' అనే ప్రజాపతి ఉండేవాడు. అతనిభర్య 'పృశ్ని', వీరిద్దరూ గొప్ప విష్ణు భక్తులు. వీరికి సంతానం లేక చాలా చింతించేవారు. శ్రీమన్నారాయణుని ప్రార్థిస్తూ ఎన్నో సంవత్సరాలు ఘోర తపస్సు చేశారు. శ్రీమన్నారాయణుడు భక్త పరాయణుడు కదా! వారి తపస్సుకు మెచ్చి దివ్య తేజస్సుతో వెలిగిపోతూ దర్శనమిచ్చాడు.

శ్రీమన్నారాయణుని దర్శనం లభించిన ఆ దంపతుల ఆనందానికి అవధి లేదు. దంపతులిద్దరూ ఆ స్వామిని అనేక విధాల స్తుతించారు. 'ఓ! జగన్నాథా! జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు. ఈ జగత్తుకు సర్వాధారము నీవే! ఈ లోకాలను సృష్టించే బ్రహ్మావు నీవే. సర్వ దేవతా గణమూ నీ యందే వున్నారు. సముద్రాలు, పర్వతాలు, నదులు, ధర్మము, యజ్ఞము, అన్నీ నీయందే వున్నాయి. పురాణాలూ, వేదాలూ, శాస్త్రాలు, చంధస్సులు, త్రికాలములు, త్రిలోకములు అన్ని నిన్ను ఆశ్రయించే ఉన్నాయి. ఈ జగత్తంతా నీవే. నీవు ఇక్కడ ఉన్నావు, అక్కడ లేవు అని ఎవ్వరూ చెప్పజాలరు. భూత, భవిష్యత్, వర్తమాన కాలంలో ఈ జగత్తంతా ఉన్నది నీవే. సర్వమూ వ్యాపించి ఉండుటచే విష్ణువు అని కీర్తింపబడుతున్నావు. జలమునందు ఉన్నావు కాబట్టి నీవు నారాయణునిగా స్తుతించబడుతున్నావు. ధర్మమును (గోవును) నీ తత్త్వముగా కలిగి ఉన్నావు కాబట్టి గోవిందునిగా అర్చింపబడుతున్నావు. హృషీకములు (ఇంద్రియములు) అన్నీ నీ నియంత్రణలో ఉంటాయి కాబట్టి హృషీకేశునిగా కొలవబడుతున్నావు. ప్రళయకాలమున సర్వజీవులను నీలోకానికి ఆకర్షించుకునే వాడివి కాబట్టి



సంకర్షణునిగా కీర్తించబడుతున్నాడు. ఆది మధ్యాంత రహితుడవు. నీ దర్శన భాగ్యంచే మా జన్మ ధన్యమయింది. అని అనేక విధాల కీర్తించారు.

అప్పుడు శ్రీమన్నారాయణుడు ఆ దంపతులతో 'భక్తులారా! మీ అకుంఠిత తపస్సుకు ఎంతో సంతోషించాను. మీకు ఏ వరం కావాలో కోరుకోమని అని సెలవిచ్చాడు. అప్పుడు ఆ దంపతులు స్వామి! ఈ విశ్వంలో నీ అంతటి దయామయుడు లేడు. మా యందు దయవుంచి నీవు మాకు పుత్రునిగా జన్మించమని వేడుకున్నారు. స్వామి చిరునవ్వు నవ్వి అట్లేనని అనుగ్రహించాడు.

ఆ తరువాత కాలంలో సుతవుడు కశ్యప ప్రజాపతిగా, పృశ్ని అదితిగా జన్మించారు. ఒకనాడు అదితి తన భర్త దగ్గరకు వెళ్లింది. అప్పుడు తన భర్త కద్రువతో సరసాలాడటం చూసి కోపించి మీరిద్దరూ నదులై పుట్టండి అని శపించింది. అప్పుడు కద్రువ కోపాద్రిక్తురాలై మమ్మల్ని ఈవిధంగా శపించిన నీవు భూలోకంలో పుట్టవలసింది అని ప్రతిశాపమిచ్చింది, ఆ విధంగా శాపవశాన అదితి భూలోకంలో దేవకిగా జన్మించింది. కశ్యప ప్రజాపతి వసుదేవునిగా జన్మించాడు. దేవకీ వసుదేవులకు మునుపటి జన్మలలో ఇచ్చిన మాట ప్రకారం శ్రీమన్నారాయణుడు వాసుదేవునిగా జన్మించాడు.

ఆ వాసుదేవుడే నేటి శ్రీనివాసుడు. తిరుమలలో శ్రీ వేంకటేశ్వరునిగా వెలసి మనలందర్నీ రక్షిస్తున్న, అమృతమూర్తి అతడే. ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "*

# మృగశిర

నక్షత్ర సమూహంలో అయిదవదైన 'మృగశిర' నక్షత్రానికి అధిపతి చంద్రుడు. మృగశిర నక్షత్రం నాడు పౌర్ణమిగల మాసమే 'మార్గశిర' మాసం. సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడే మాసాలలో మార్గశిరమాసం తానేనని శెలవిచ్చాడు. కాబట్టి మార్గశిర మాసం ఆ పరబ్రహ్మమూర్తికి అత్యంత ప్రీతికరం. పూర్వకాలంలో ఒకప్పుడు కొత్త సంవత్సరం 'మృగశిర' నక్షత్రంలోనే ప్రారంభమయ్యేది. అందుకే ఈ నక్షత్రాన్ని 'అగ్రహామణి' అని కూడా అనేవారు. ఈ మాసంలో, ప్రత్యేకించి మార్గశిర పౌర్ణమినాడు తిరుమలలో శ్రీనివాసుని స్మరించినా, దర్శించినా సర్వ సౌభాగ్యాలూ లభిస్తాయి.

పూర్వకాలంలో ఒకసారి ప్రజాపతి దేవతలు, రాక్షసులతో అనేక విషయాలు చర్చిస్తుండగా ఆత్మ ఏమిటి, దాని రూపం ఎలా వుంటుంది అనే విషయం వచ్చింది. అప్పుడు ప్రజాపతి వీరితో 'నాయనలారా! ఆత్మకు పాపం అంటదు. ఆత్మ పరబ్రహ్మమూర్తి స్వరూపమే. అనంత చైతన్యమూర్తి.



ఆత్మకు సుఖదుఃఖాలు అంటవు. ఆత్మ నిత్య ఆనందమూర్తి. ఆత్మకి ఆకలి, దప్పులు లేవు. ఆత్మకు చావు, పుట్టుకలు లేవు. ఆత్మ గురించి సత్యం తెలుసుకున్నవారు బ్రహ్మానందానికి లోనవుతారు' అన్నాడు.

ఈ విషయం తెలుసుకున్న రాక్షసుల రాజు విరోచనుడు, దేవతల రాజైనటువంటి ఇంద్రుడు కలిసి బ్రహ్మ వద్దకు చేరుకుని తమకు ఆత్మగురించి పూర్తిగా వివరించవలసిందిగా వేడుకున్నారు. అప్పుడు బ్రహ్మ వీరు ఇద్దరినీ ముప్ఫైరెండు సంవత్సరాలు బ్రహ్మచర్యదీక్ష వహించమని చెప్పాడు. వారు అట్లేనని కఠోర దీక్ష చేసి ముప్ఫై రెండు సంవత్సరాల తర్వాత బ్రహ్మ వద్దకు వచ్చారు.

అప్పుడు వారు ఇద్దరినీ చూసి బ్రహ్మ 'నాయనలారా! చాలా సంతోషం మీకు ఆత్మ స్వరూపం చెప్తాను సావధానంగా వినండి' అని చెప్పుతూ మీరిద్దరూ ఒక్కసారి నీటిలోనూ, అద్దంలోనూ మీ ప్రతిబింబాలు చూసుకుని నాకు చెప్పండి. మీకు ఆత్మస్వరూపం తెలుస్తుంది. వాళ్ళిద్దరూ అలాగే చేసి బ్రహ్మవద్దకు వచ్చి 'స్వామీ! మా ఇద్దరికీ నీటిలోనూ, అద్దంలోనూ కూడా మీ శరీరాలే కనబడుతున్నాయి. అంతే కానీ, మాకు ఆత్మ కనబడలేదు' అన్నారు. అప్పుడు బ్రహ్మ వారితో 'ఓహో ! అలాగా అయితే ఈసారి మంచి దుస్తులు ధరించి, బ్రహ్మాండమైన ఆభరణాలు ధరించి తిరిగి మళ్ళీ నీటిలోనూ, అద్దంలోనూ మీ ప్రతిబింబాలు చూసుకోండి. ఈసారి ఆత్మ మీకు తప్పక కనపబడుతుంది' అన్నాడు.

ఇది విని ఇద్దరూ సంతోషపడి అత్యంత అందమైన దుస్తులు, ఆభరణాలు ధరించి తమ ప్రతిబింబాలను నీటిలోనూ, అద్దంలోనూ చూశారు. ఈసారి వారి శరీరాలు ఈ అలంకరణల వలన ఎంతో అద్భుతంగా కనిపించాయి. ఆహా! ఎంత అద్భుతంగా ఉన్నాయి! ఇదే ఆత్మ స్వరూపం

అయి ఉంటుంది. ఆత్మ ఎంతో అద్భుతంగా ఉంటుందని బ్రహ్మదేవుడు చెప్పాడు గదా! ఇంకేముంది! ఆ అద్భుత రూపాన్ని చూశాము! అని ఇద్దరూ తలచి తిరిగి బ్రహ్మ వద్దకు కూడా వెళ్ళకుండా ఎవరి స్థానాలకు వాళ్లు పయనమైనారు. రాక్షసుల రాజైన విరోచనుడు రాక్షసులకు ఆత్మ తత్త్వం అంటే అద్భుతమైన ఆభరణాలు, వస్త్రాలనే చెప్పాడు. అదే ఆత్మ స్వరూపం అనుకుని రాక్షసులందరూ సంతోషపడ్డారు.

దేవలోకానికి బయలుదేరిన ఇంద్రునికి సగం దూరం వెళ్ళగానే తాను నేర్చుకున్న దానిలో ఏదో లోపం ఉందని అనిపించింది. ఆత్మ రూపం మారదు. దానికి చావులేదు, పుట్టుక లేదు, రంగు లేదు, రూపం లేదు, వాసన కూడా లేదు అని బ్రహ్మదేవుడు చెప్పాడు కదా. మరి అటువంటప్పుడు ఆభరణాలు ధరించినప్పుడు ఒక మాదిరిగాను, లేనప్పుడు మరొక్క రూపంలోనూ ఎలా కనిపించింది. అంటే ఒకవేళ ఆభరణాలు పాడైతే ఆత్మ రూపం కూడా పాడౌతుందా? కానీ బ్రహ్మ చెప్పినదాని ప్రకారం ఇలా జరగడానికి వీల్లేదు. ఇలా అనుకుని ఇంద్రుడు తాను అర్థం చేసుకున్నదాంట్లో ఏదో పొరపాటు ఉందని గ్రహించి తిరిగి బ్రహ్మ వద్దకు వెళ్ళి తన సందేహాలన్నీ చెప్పాడు.

అప్పుడు బ్రహ్మ ఇంద్రుడు చెప్పినవన్నీ విని తిరిగి ముప్పైరెండు సంవత్సరాలు బ్రహ్మచర్య దీక్ష వహించి రమ్మన్నాడు. బ్రహ్మదేవుని వద్ద శెలవు తీసుకుని ఇంద్రుడు వెళ్లిపోయాడు. బ్రహ్మ చెప్పినట్లుగానే ముప్పైరెండు సంవత్సరాలు దీక్ష పూర్తి చేసి తిరిగి బ్రహ్మదగ్గరకు వచ్చాడు. అప్పుడు బ్రహ్మ ఇంద్రునితో 'నాయనా! స్వప్నంలో నువ్వు స్వేచ్ఛగా వుంటావు గదా! అలా స్వేచ్ఛగా తిరిగే చైతన్యమూర్తే ఆత్మ' అన్నాడు. ఆహా! అద్భుతం ఆత్మ గురించి మొత్తం తెలిసిందనుకుని సంతోషపడి ఇంద్రుడు తిరిగి



దేవలోకానికి బయలుదేరాడు. కాసేపటికే మనస్సులో మరో సందేహం వచ్చింది. స్వప్నంలో కనిపించేది ఆత్మ ఎలా అవుతుంది? మనకు స్వప్నంలో సుఖాలు కలిగినపుడు ఆనందకరమైన అనుభూతి కలుగుతుంది. కానీ అదే చెడ్డ కలలు వస్తే అది స్వప్నమైనా బాధపడుతున్నాం కదా. ఇలా దుఃఖించేదైతే స్వప్నం ఆత్మ ఎలా అవుతుంది? ఆత్మ అంటే మహదానంద కరమైనది అని బ్రహ్మ చెప్పాడు కదా! అటువంటప్పుడు ఈ దుఃఖపూరితమైనది ఆత్మ కానే కాదు అని తలచి తిరిగి బ్రహ్మ వద్దకు వెళ్ళి తన అనుమానాన్ని చెప్పాడు.

అప్పుడు బ్రహ్మ ఇంద్రునితో 'నాయనా ! నీ పట్టుదలకు చాలా సంతోషం. నీకు ఆత్మ తత్త్వం పూర్తిగా వివరిస్తాను. సావధానంగా వినవలసింది అని ఈవిధంగా చెప్పసాగాడు. 'నాయనా! ఇంద్రా ఆత్మ శాశ్వతమైనది. ఈ శరీరం అశాశ్వతం. విచిత్రమేమిటంటే శాశ్వతమైన ఆత్మ అశాశ్వతమైన శరీరాన్ని అంట పెట్టుకుని ఉన్నది. దాని వలననే అందరూ శరీరం కూడా శాశ్వతమేనని భ్రమిస్తాను. కానీ శరీరం శాశ్వతం కాదు. ఆత్మ ఒక్కటే శాశ్వతమైనది. ఈ రహస్యం గ్రహించిన వారి ఆనందానికి అంతు ఉండదు. ఆ ఆత్మ పరబ్రహ్మ మూర్తి. సచ్చిదానంద స్వరూపం. అతడే శ్రీమన్నారాయణుడు. నాయనా! ఇంద్రా ! మనందరిలోనూ ఉన్న ఆత్మరూపం ఆ పరమేశ్వరుడే! లోకంలో ఉన్నదంతా ఆత్మస్వరూపమే. అందరిలోనూ, సమస్త జీవరాసులందనూ సమానంగా ఉన్నది ఆత్మయే. ఆత్మలోనే అన్నీ పుట్టి, ఆత్మలోనే అన్నీ నశిస్తాయి.

ఇంద్రియాలను ప్రేరేపించేది ఆత్మ కాబట్టి వాటికి ఆత్మస్వరూపం తెలియదు. ఆత్మ యొక్క చైతన్యశక్తి చేతనే ఇంద్రియాలన్నీ పని చేస్తున్నాయి. ఆత్మ సాక్షాత్కారం పొందినవాడి ఆనందమే బ్రహ్మానందం.

ఆ పరబ్రహ్మమూర్తి సర్వాంతర్యామియై సమస్త జీవరాశుల హృదయాలలో ఉన్నాడు' అని వివరించాడు. ఇంద్రుడు ఎంతో సంతోషపడి దేవలోకానికి పయనమయ్యాడు.

అంతటి పరబ్రహ్మమూర్తియే తిరుమలలో వెలసిన శ్రీనివాసుడు. ఆ శ్రీనివాసుని తత్త్వం తెలుసుకున్నవారికి సర్వశాస్త్రాల జ్ఞానము, సర్వ వేదాల సారము లభిస్తుంది. శ్రీ వేంకట తత్త్వం గ్రహించిన వారి ఆనందానికి అంతు లేదు.

ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "*



# ఆరుద్ర

ఆరుద్ర నక్షత్రానికి అధిదేవత రుద్రుడు. రుద్రునిది అర్థనారీశ్వర తత్త్వము. సృష్టిలో ప్రతి అణువుకు రెండు ధృవాలు ఉంటాయి. ఆకర్షణ, వికర్షణ శక్తులు లేకుండా ప్రాణమే ఉండదు. మానవుని శరీరంలో ఎడమవైపు (చంద్రనాడి) స్త్రీ శక్తిగా, కుడివైపు (సూర్యనాడి) పురుష శక్తిగాను కలిసి ఉండటమే రుద్రుని అర్థనారీశ్వర తత్త్వ రహస్యము.

శివకేశవులిద్దరికీ బేధం లేదు. సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడే శ్రీనివాసునిగా వెలసిన పవిత్ర క్షేత్రం వేంకటాద్రికి క్షేత్ర పాలకుడు రుద్రుడే.

ఆరుద్ర నక్షత్రం రోజున శివకేశవులిద్దరినీ స్మరించినవారికి ఎటువంటి ఆపదలూ కలగవు. ఈ నక్షత్రం రోజున శ్రీనివాసుని స్మరించినా, దర్శించినా సకల భోగ భాగ్యాలూ కలుగుతాయి. శ్రీ వేంకటేశ్వరుడు భక్తులపాలిటి కల్పతరువు. తనను నమ్మినవారికి సర్వ సంపదలు అనుగ్రహిస్తాడు. ఈ విశ్వంలోని నామాలన్నీ అతనివే. ఈ విశ్వమంతా వ్యాపించి ఉండటంవలన విష్ణువు అనబడుతున్నాడు. తనను నిత్యం స్మరించే వారి బాధ్యత తానే

వహిస్తాడు కాబట్టి మిత్రుడు అని పిలవబడుతున్నాడు. నాశనము లేనివాడు కాబట్టి అచ్యుతుడు అని వ్యవహరించబడుతున్నాడు. ఈ సమస్త విశ్వాన్నీ సృష్టించినవాడు కాబట్టి బ్రహ్మ అనబడుతున్నాడు. తనకు తానుగా ఉన్నవాడు, చావు పుట్టుకలు లేనివాడు కావున స్వయంభువు అయినాడు. కళ్యాణ స్వరూపుడై సకల శుభాలను భక్తులకు అనుగ్రహించేవాడు కాబట్టి శివునిగా అర్చించబడుతున్నాడు. “వేం” అంటే అమృతము, “కట” అనగా ఐశ్వర్యము. తనను నమ్మినవారిపై అమృత ఐశ్వర్యాలను కురిపించేవాడు కాబట్టి వేంకటేశ్వరుడైనాడు. ఇంద్రియములను నియంత్రించేవాడు కాబట్టి హృషీకేశుడైనాడు. పక్షి రాజైన గరుత్మంతుని వాహనముగా చేసుకుని సంచరించేవాడు కాబట్టి విక్రముడు అని పిలవబడుతున్నాడు.

ఒకసారి పరమ విష్ణు భక్తుడైన అంబరీశుడు శ్రీమన్నారాయణునికి ఎంతో ప్రియమైనటువంటి ద్వాదశీ వ్రతాన్ని ఎంతో భక్తిశ్రద్ధలతో ఆచరించాడు. బ్రాహ్మణ సమారాధన పూర్తిచేసి ఇంక తాను భోజనానికి ఉపక్రమించబోతుండగా అక్కడికి మహా కోపిష్టి అయిన దుర్వాస మహర్షి రావడం జరిగింది. అంబరీశుడు వెంటనే దుర్వాసులవారికి నమస్కరించి అనేక సపర్యలు గావించి స్వామీ మీరు భోజనానికి లేవండి అని ఆహ్వానించాడు. అప్పుడు దూర్వాసుడు అలాగేనని నదీతీరానికి వెళ్లి స్నానం చేసి వస్తానని చెప్తాడు. అందుకు అంబరీశుడు సరేనన్నాడు. స్నానానికి వెళ్ళిన దూర్వాసుడు స్నానం నుంచి ఎంతసేపటికి తిరిగి రాలేదు. ద్వాదశి ఘడియలు కూడా మించిపోతున్నాయి. అంబరీశునిలో ఆందోళన మొదలైంది. ఈ మహర్షి ఇంకా రాడేమిటి? ఇతడు రాకుండా భోజనం చేస్తే అతిథిని అవమానించినట్లవుతుంది. అలాగని భోజనం చేయకుండా ఉంటే ద్వాదశి దాటిపోయి ఇంత అద్భుతంగా చేసిన వ్రతఫలం దక్కదు. ఈ పరిస్థితిలో ఏం చేయాలో తోచక సంశయపడుతున్న అంబరీశుని అక్కడ



వున్న మహర్షులు ‘ఉదకపారణ’ చేయమని చెప్పారు. దానివలన వ్రతం యొక్క ఫలితమూ దక్కుతుంది. అతిథి రాకుండా భోజనమూ చేసినట్లు అవ్వదు. ఈ సలహా బాగుందని తలచిన అంబరీశుడు అలాగే ఉదకపారణ చేశాడు.

అయినప్పటికి అంబరీశుని మనసులో ఆందోళన తగ్గటం లేదు. అసలే దూర్వాసుడు ముక్కోపి. తాను ఈవిధంగా చేసినందుకు ఏం శపిస్తాడో అని లోలోపల మధన పడుతున్నాడు. అంతలో దూర్వాసుడు రానే వచ్చాడు. జరిగినదంతా తెలుసుకుని విపరీతమైన కోపంతో తన జడలోంచి ఒక వెంట్రుకను పీకి ‘మహాకృత్య’ అనే శక్తిని సృష్టించాడు. అంబరీశుని దండించమని ఆ శక్తిని ఆజ్ఞాపించాడు. మహాకృత్య అంబరీశుని పైకి రాసాగాడు. అంబరీశుడు ఎంతో భయపడి తనకు ఇంకా శ్రీహరియే దిక్కని తలచి కళ్లు మూసుకుని శ్రీమన్నారాయణుని ప్రార్థించాడు.

శరణన్నవారిని తక్షణం రక్షించేవాడు కదా శ్రీమన్నారాయణుడు. తన భక్తులను కష్టపెట్టినవారిని ఎటువంటి పరిస్థితులలోనూ వదిలిపెట్టడు. వెంటనే తన చక్రాయుధాన్ని ప్రయోగించాడు. చక్రాయుధం అమిత శక్తితో ప్రచండభానుడిలా ప్రకాశిస్తూ ‘మహాకృత్యను’ సంహరించి, ఆ తర్వాత దూర్వాసునిపైకి వెళ్లసాగింది. జరిగినదంతా గ్రహించి, ఈ చక్రాయుధం బారినుంచి తనను రక్షింపవలసిందిగా బ్రహ్మను కోరాడు. బ్రహ్మ ఈ విషయంలో తానేమీ చెయ్యజాలనన్నాడు. అప్పుడు కైలాసానికి వెళ్ళి శివుని వేడుకున్నాడు. అప్పుడు పరమేశ్వరుడు దూర్వాసునితో ఓ మూర్ఖుడా! శివకేశవులకు బేధం లేదని నీకు తెలియదా. నేనీ విషయంలో ఏమీ చేయజాలను. వైకుంఠానికి వెళ్లి ఆ శ్రీహరినే శరణు వేడుకొమ్మని అన్నాడు. అప్పుడు దూర్వాసుడు పరుగు పరుగున వైకుంఠానికి వెళ్లి తనను

చక్రాయుధం బారినుండి రక్షింపవలసిందిగా పరి పరివిధాల శ్రీహరిని వేడుకున్నాడు. శ్రీమన్నారాయణుడు ఈ విషయంలో తాను కూడా ఏమీ చేయలేనని, తాను తన భక్తులకు పూర్తిగా దాసుడనని, వెళ్లి అంబరీశునే శరణు వేడవలసిందిగా చెప్పాడు.

ఇక వేరే గత్యంతరం లేక దూర్వాసుడు అంబరీశుని కాళ్ళపై పడి తనను చక్రాయుధం బారి నుండి రక్షింపవలసిందిగా అర్ధించాడు. అప్పుడు అంబరీశుడు శ్రీమన్నారాయణులవారిని ప్రార్థించి దూర్వాసుని చక్రాయుధం బారినుండి రక్షించాడు.

ఈ విధంగా శ్రీమన్నారాయణునికి తన భక్తులంటే వల్లమాలిన ప్రేమ. తన భక్తులను ఎవరైనా అవమానించినా, హింసించినా ఏ మాత్రం ఉపేక్షించడు. తన భక్తులను సర్వకాల సర్వావస్థలయందు కనిపెట్టుకుని ఉండేవాడు ఆ శ్రీనివాసుడే.

ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*“ శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ”*



# పునర్వసు

పునర్వసు నక్షత్రానికి అదిధేవత అదితి. త్రేతాయుగంలో శ్రీమన్నారాయణుడు ఈ పునర్వసు నక్షత్రంలోనే శ్రీరామచంద్రుడుగా జన్మించి రాక్షస సంహారం గావించాడు. పునర్వసు అంటే తిరిగి నివసించేది అని అర్థం. శ్రీమన్నారాయణుడు సకల చరాచర జగత్తును సృష్టించి, తిరిగి తాను వీటిలోనే నివసిస్తాడు. విష్ణు సహస్రనామాలలో నూటయాభయ్యవ నామం కూడా పునర్వసుయే. సకల జీవుల హృదయాలలోనూ ఆత్మ రూపంలో ఉండేది ఈ పరబ్రహ్మామూర్తియే.

సృష్టి ప్రారంభంలో జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ సమయంలో నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు అయిన పరమేశ్వరుడు బిందురూపంలో ఉన్నాడు. అదే ప్రణవ స్వరూపం. ఆ ప్రణవ స్వరూపం నుండే సమస్త జగత్తు ఆవిర్భవించింది. ఈ సృష్టిలోని సకల రూపాలూ ఆయనవే. అతడి రూపము ఇలా ఉంటుంది, అలాగ ఉండదు, అని చెప్పలేము. ఈ యుగంలో ఉన్నాడు, ఆ యుగంలో లేదు అని చెప్పలేము. సర్వకాల సర్వావస్థలలోనూ

ఉన్నది అతడే. ఈ సృష్టికి పూర్వమూ ఉన్నాడు, ఈ సృష్టి ఉద్భవించిన తరువాత ఉన్నాడు, ఈ సృష్టి లయం అయిన తరువాత కూడా ఉంటాడు. ఆ పరబ్రహ్మమూర్తియే శ్రీనివాసుడు.

ఆ అమృతమూర్తి ఆద్యంతాలు లేనివాడు. అత్యంత సుందర రూపుడు. అతని సౌందర్యం వర్ణించటం ఎవ్వరి తరమూ కాదు. త్రేతాయుగంలో ఒకసారి మునీశ్వరులు దివ్య మంగళ స్వరూపుడైన శ్రీరామచంద్రుని చూసి 'స్వామీ'! నిన్నొకసారి తనివితీరా కౌగలించుకోవాలని మనస్సు ఉవ్విళ్ళూరుచున్నది. మమ్ములను అందుకు అనుగ్రహించవలసింది అని అర్థించారు. అప్పుడు శ్రీరామచంద్రుడు చిరునవ్వుతో 'ఓ మునీశ్వరులారా! మీరందరూ నాకెంతో ఆప్తులు, మీ కోరిక తీర్చుటకంటే మించిన ఆనందము నాకేమున్నది? తప్పక తీర్చెదను. ద్వాపర యుగంలో నేను శ్రీకృష్ణునిగా జన్మిస్తాను. అప్పుడు మీరందరూ గోపికలుగా జన్మించండి. అప్పుడు మీ కోరిక తప్పక తీరుతుంది అని అనుగ్రహించాడు. ఆ పరబ్రహ్మమూర్తి అయిన శ్రీమన్నారాయణుడు అత్యంత నిష్ఠా గరిష్ఠులైన మునీశ్వరులకు సైతం మోహం కలిగించే అద్భుత సుందర స్వరూపుడు.

ఎన్నో జన్మల పుణ్యఫలంచేత గానీ శ్రీనివాసుని దర్శించాలనే తలంపు కలుగదు. ఆ స్వామిని అర్చించాలని గానీ, ధ్యానించాలని గానీ మనస్సుకు సంకల్పం కలుగదు. ఇది ఒక్క జన్మతో సాధ్యమయ్యేది కాదు. ఆ పరబ్రహ్మమూర్తి అనుగ్రహం పొందడానికి ముఖ్యంగా ఏడు సోపానాలు ఉన్నాయి. అవే కర్మానుష్ఠానము, శ్రద్ధ, అకుంఠిత భక్తి, భగవత్ప్రేమ?, ఆత్మజ్ఞానము, సమదర్శన జీవనము, సాధుజన సేవ, చివరిగా సంపూర్ణ శరణాగతి. ఈ ఏడు సోపానాలను అధిరోహించిన వాడే శ్రీమన్నారాయణుని చేరుకోగలుగుతాడు.



యజ్ఞము, యజ్ఞ కర్త, యజ్ఞ కర్మ, యజ్ఞ ఫలము అంతా కూడా శ్రీమన్నారాయణుని స్వరూపమే. అందుకే యజ్ఞోవై విష్ణుః అనబడింది. కేవలం స్మరించినంతమాత్రానే సర్వ సౌభాగ్యాలనూ అనుగ్రహించేవాడు ఈ శ్రీమన్నారాయణుడే.

సత్యయుగంలో ఒకసారి బ్రహ్మదేవుడు స్వర్గాన్ని దర్శించాలనే తలంపుతో బయలుదేరి స్వర్గలోకాన్ని చేరుకున్నాడు. అక్కడ బ్రహ్మదేవునికి అద్భుత సౌందర్యరాశులైన అప్సరసలు ఎదురు వచ్చి ఆహ్వానించారు. కళ్ళు చెదిరే ఆ సౌందర్యానికి బ్రహ్మకు రేపతనమైంది. అందులోనుంచి అద్భుత తేజస్సుగల ఒక బాలుడు జన్మించాడు. వెంటనే ఆ బాలుడు బ్రహ్మతో కలిసి స్వర్గలోకమంతా తిరుగుతూ తండ్రీ నమస్కారం. ఏమిటి మీ ఆజ్ఞ అని ప్రశ్నించసాగాడు. ఎంత విసుక్కున్నా ఆ బాలుడు బ్రహ్మతోటే ప్రతిచోటికి వెళుతూ ఇదే ప్రశ్న అడుగుతున్నాడు. ఈ బాలున్ని చూసి అందరూ ఆశ్చర్యపోయారు. ఎవరీ బాలుడు? ఎందుకు బ్రహ్మ వెంట ఇలా తిరుగుతున్నాడు? అని తలుస్తున్నారు. బ్రహ్మకు కోపం వచ్చి ఆ బాలునితో నన్ను ఇంతగా హింసిస్తున్న నీవు భూలోకంలో బోయవాడిగా జన్మించి క్రూర కర్మలు చేస్తూ జీవిస్తావు! అని శపించాడు. అప్పుడు ఆ బాలుడు బ్రహ్మ కాళ్ళపై పడి 'తండ్రీ! ఇంతటి శాపమా ! నేనేమి తప్పు చేశానని నాకు ఇంతటి శిక్ష. దయచేసి శాప విమోచనం అనుగ్రహించవలసింది అని పరి పరివిధాల అర్థించాడు. అప్పుడు బ్రహ్మ కొంచెం శాంతించినవాడై రామనామ జపంతో శాపవిమోచనం అవుతుందని అనుగ్రహించాడు.

కాలక్రమంలో ఆ పిల్లవాడే భూలోకంలో బోయవాడుగా జన్మించాడు. భార్యా బిడ్డలను పోషించడానికి పక్షులను, మృగాలను వేటాడుతూ, దారి

దోపిడీలు చేస్తూ జీవింపసాగాడు. ఆ బోయవాని అఘాయిత్యాలకు అంతు లేకుండా ఉండేది. చిన్నా పెద్దా, బీదలు, ధనికులు అనే బేధం లేకుండా దారి కాచి అందరినీ పూర్తిగా దోచుకునేవాడు.

రోజులు ఇలా జరుగుతుండగా ఒకనాడు ఆ బోయవానికి అటుగా వస్తున్న కొందరు మునీశ్వరులు కంట పడ్డారు. వెంటనే వాళ్లను కూడా దోచుకోడానికి సిద్ధమయ్యాడు. అత్యంత తపో గరిష్ఠులైన ఆ మునీశ్వరులకు ఈ బోయవాని గతమంతా కళ్ళముందు కనిపించింది. వెనుకటి జన్మలో అతనెవరో గ్రహించారు. వారు అతనితో 'నాయనా! తపస్సు చేసుకుంటూ బ్రతికేవాళ్ళం మా దగ్గర ఏముంటుంది? అయినా యిలా దోచుకునే సొమ్ముతో నువ్వు ఏం చేస్తావు? అని అడిగారు. అప్పుడు బోయవాడు ఈ సొమ్ముతో భార్యా బిడ్డలను సుఖపెడతానన్నాడు. అప్పుడు ఆ మహర్షులు ఈ సొమ్ముతో నీ భార్యాబిడ్డలను పోషిస్తావా. ఈ విధంగా దొంగతనం చేసి సంపాదించిన సొమ్ము పాపపు సొమ్ము కదా!, మరి ఈ విధంగా చెయ్యడం వలన నువ్వు మూటకట్టుకున్న పాపం సంగతి ఏమిటి అని అడిగారు. అప్పుడు ఆ బోయవాడు 'ఇదేమి ప్రశ్న?, నాకెందుకు పాపం వస్తుంది? ఈ ధనం మొత్తం అనుభవిస్తున్నది వాళ్ళే కదా!. అటువంటప్పుడు ఆ పాప ఫలం కూడా వారే అనుభవిస్తారు అన్నాడు. అప్పుడు ఆ మహర్షులు బోయవానితో 'అలాగా నాయనా ! నీ ఆలోచన బాగానే ఉంది, కానీ ఇదే విషయం వెళ్ళి నీ భార్యను అడిగి చూడు, ఆమె సమాధానం ఏమిటో తెలుసుకుని వచ్చి మాకు చెప్పవలసింది' అన్నారు.

అప్పుడా బోయవాడు ఇంటికి తిరిగి వెళ్ళి భార్యను ఇదేప్రశ్న అడిగాడు. 'నా ధనంతో నువ్వు సుఖపడుతున్నావు గదా! మరి నా పాపంలో కూడా 'సగభాగం నీకే ఉంటుంది అన్నాడు? అప్పుడు భార్య విసుగ్గా నాకెందుకు



సగభాగం ఉంటుంది, నీ పాపంతో నాకు సంబంధం లేదు, భర్తగా నన్ను, పిల్లల్ని పోషించటం నీ బాధ్యత. కాబట్టి ఆ పాపం నీదే తప్పు, నాది కాదు అని చెప్పింది. ఇది విన్న బోయవాడికి జీవితం మీద విరక్తి పుట్టింది. తిరిగి వచ్చి మునీశ్వరులకు తన భార్య చెప్పినది వివరించి తనకు ఈ జీవితం మీద విరక్తి కలిగిందని మోహాలన్నీ నశించాయని, ముక్తి మార్గం ఉపదేశించమని అర్థించాడు. అప్పుడు ఆ మహర్షులు ఆ బోయవానికి రామ మంత్రం ఉపదేశించారు. అంతే! వెంటనే ఆ మంత్రాన్ని స్మరిస్తూ సమాధి స్థితిలోనికి వెళ్లిపోయాడు. కాలక్రమేణా అతనిచుట్టూ ఎన్నో పుట్టలు వచ్చాయి. అయినా చలించలేదు. అతడే వాల్మీకిగా ప్రసిద్ధుడైనాడు. శ్రీరామచంద్రుని రామాయణ దివ్య చరిత్రను రచించి తన జన్మ సార్థకం చేసుకున్నాడు. రామమంత్రం అంతటి మహా మహిమాన్వితమైనది.

ఆ శ్రీరామచంద్రుడే నేటి తిరుమల శ్రీనివాసుడు. ఎవరి నామ స్మరణతో సర్వ సౌభాగ్యాలూ కలుగుతాయో, సర్వ వేదసారమూ బోధ పడుతుందో, సర్వ సంపదలూ ఒనగూరుతాయో అతడే శ్రీనివాసుడు. పునర్వసు నక్షత్రం నాడు శ్రీనివాసుని దర్శించినా, స్మరించినా ఇహలోకంలో సుఖంగా బ్రతికి చివరన ముక్తిని పొందుతారు.

ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "*

# పుష్యమి

పుష్యమి నక్షత్రానికి అధిపతి బృహస్పతి. పుష్యమి నక్షత్రంలో కూడిన గురువారం నాడు శ్రీనివాసుని దర్శించినవారికి సకల శుభాలూ చేకూరుతాయి. సర్వకార్య సిద్ధి జరుగుతుంది.

పూర్వకాలంలో కోసల దేశంలో విష్ణుశర్మ అనే బ్రాహ్మణుడు నివసించేవాడు. వేదవిద్యా పారంగతుడైన విష్ణుశర్మ ఎల్లప్పుడు సత్కర్మలను ఆచరిస్తూ, హరినామస్మరణలోనే జీవితం గడుపుతుండేవాడు. విష్ణుశర్మ భార్య రుక్మిణమ్మ కూడా ఎంతో భక్తురాలు. ప్రతీరోజూ శ్రీమన్నారాయణుని పూజిస్తూ, విష్ణు సహస్రనామ పారాయణం చేస్తూ, ఇంటికి వచ్చిన బంధుమిత్రులందరినీ ఆదరణగా చూస్తూ కాలం గడిపేది. వీరిద్దరికీ వివాహం అయిన చాలా సంవత్సరాల వరకు సంతానం కలుగలేదు. ఈ విధంగా పన్నెండు సంవత్సరాలు గడిచిన తరువాత శ్రీనివాసుని అనుగ్రహంతో పండంటి మగపిల్లాడు పుట్టాడు. ఆ దంపతులు ఈ బాలునికి వేంకటశర్మ అని పేరు పెట్టి అల్లారుముద్దుగా పెంచసాగారు. అయిదు



సంవత్సరాల వయసురాగానే వేంకటేశ్వరశర్మకి విద్యాభ్యాసం కావించారు. గురుకులంలో చేర్పించారు. రెండు, మూడు సంవత్సరాలు గడిచినా ఆ బాలుడికి సరిగ్గా అక్షరాలు పలకటం కూడా రావటల్లేదు. విష్ణు శర్మ దంపతులకు బెంగ పట్టుకున్నది. అసలు తమ కుమారునికి చదువు ఒంట పడుతుందా లేదా అని ఆలోచన పట్టుకున్నది.

ఒక రోజు విష్ణుశర్మ గురుకులానికి వెళ్ళి ఉపాధ్యాయులను కలుసుకుని వేంకటశర్మ గురించి ఆరా తీసాడు. ఆ ఉపాధ్యాయులు విష్ణుశర్మతో వేంకటశర్మకు ఎన్నో విధాల ప్రయత్నించినా ఒక్క అక్షరం ముక్క కూడా రావటల్లేదని, మరో సంవత్సరం చూసి ఇంటికి పంపివేస్తామని చెప్పారు. ఈ మాట విని బెంగతో ఇంటిదారి పట్టాడు విష్ణుశర్మ. దారిలో వస్తూ ఇదే ఆలోచనలో ఉన్నాడు. తండ్రీ! శ్రీనివాసా! శ్రీమన్నారాయణా! ఆప్తబంధూ! ఏమిటీ శాపం తండ్రీ! నా కుర్రవాడికి ఏ మాత్రం చదువు రాకపోవడమేమిటి? చదువు రానివాడైతే ఎందుకూ పనికి రాడు గదా! జీవితం ఏ విధంగా వెళ్ళబుచ్చుతాడు? నీవే అనుగ్రహింపవలసింది. నీవు తప్ప నాకు దిక్కెవరు తండ్రీ! సర్వకాల సర్వావస్థలయందునూ నిన్నే తలుస్తున్నాను. నాయందు అనుగ్రహముంచి నా కుమారునికి విద్యాబుద్ధులు వచ్చేలాగా అనుగ్రహించవలసింది అని అనేక విధాల స్వామిని ప్రార్థిస్తూ తిరిగి తన ఇంటికి రాసాగాడు. అలా కొంతదూరం రాగానే ఒకానొక చోట ఒక సాధుపుంగవుడు దివ్య ప్రవచనాలు చేస్తూ కనపడ్డాడు. ఎంతో మంది ప్రజలు ఆ ప్రవచనాలను ఎంతో శ్రద్ధగా వింటున్నారు. అదేదో తాను విందామనుకుని అటుగా వెళ్లాడు.

ఆ సమయంలో ఆ సాధువు శ్రీమన్నారాయణుని తత్త్వాన్ని వివరిస్తున్నాడు'. ఓ శ్రీమన్నారాయణుని ప్రియభక్తులారా! పరబ్రహ్మ మూర్తి

శ్రీనివాసుని మించిన దైవం లేదు? ఆ దివ్యమంగళ మూర్తి స్వరూపము అద్భుతమైనది, నిరవద్యమైనది, అప్రాకృతమైనది, శాశ్వతమైనది, కోటి సూర్య తేజస్సుతో ప్రకాశించే సృష్టి, స్థితి, లయ కారకుడు శ్రీమన్నారాయణుడు. సృష్టి చేసే కాలంలో రజోగుణ ప్రధానుడై సృష్టిని, స్థితి కాలములో సత్త్వగుణ ప్రధానుడై పరిపాలనా భారాన్ని, లయ కాలంలో తమోగుణ ప్రధానుడై సంహారమును చేస్తున్నాడు. శ్రీమన్నారాయణుడు నాలుగు అంశాలతో ఈ సృష్టి, స్థితి, లయ కార్యక్రమాలను చేస్తున్నాడు. సృష్టికాలంలో ఒక అంశతో బ్రహ్మగా అంతరించాడు. రెండో అంశతో మరీచి మొదలైన ప్రజాపతులుగా అవతరించాడు. మూడవ అంశతో కాలము, నాలుగవ అంశతో సర్వభూతాలుగానూ వ్యక్తీకరించబడ్డాడు.

ఇదే విధంగా స్థితి సమయాలలో ఒక అంశతో విష్ణువుగానూ, రెండవ అంశతో మనువులుగానూ, మూడవ అంశతో కాలముగానూ, నాలుగవ అంశతో సర్వప్రాణులుగానూ అయి ఈ సృష్టినంతటినీ పాలిస్తున్నాడు. ఇక మూడవది లయకారకుడు. ఈ లయ స్థితిలో మొదటి అంశతో రుద్రుడుగాను, రెండవఅంశతో అగ్నిగానూ, మూడవ అంశతో కాలముగానూ, నాలుగవ అంశతో సర్వభూతములను లయము చేస్తున్నాడు. ఇందువలననే ఆ పరబ్రహ్మమూర్తి చతురాత్మా అని పిలవబడుతున్నాడు.

ఇంతటి మహోన్నతమైన ఈ పరబ్రహ్మమూర్తిని అర్చించినవారికి ఎటువంటి ఆపదలూ దరి చేరవు. సకల భాగ్యాలూ సమకూరుతాయి. సర్వ ఐశ్వర్యాలూ సిద్ధిస్తాయి!. అని ఈ విధంగా ప్రవచనం కొనసాగిస్తున్నాడు.

అప్పుడు విష్ణుశర్మ ఈ ప్రవచనం పూర్తి అయ్యేవరకూ అక్కడే ఉండి చివరన ఆ సాధువును కలుసుకుని తన కుమారునికి చదువు అబ్బకపోవడం



గురించి వివరించాడు. వేంకట శర్మకు విద్యాబుద్ధులు కలిగే ఉపాయాన్ని అనుగ్రహించవలసిందిగా వేడుకున్నాడు. అప్పుడు ఆ సాధువు 'నాయనా! నీ బాధ నాకు అర్థమయింది. ఈ సృష్టిలో శ్రీమన్నారాయణునికి మించిన భక్తవత్సలుడు మరొకరు లేరు. ఆ స్వామి మనలందరినీ అనుగ్రహించడానికై తిరుమలలో శ్రీ వేంకటేశ్వరునిగా అవతరించి నిత్య పూజలందు కుంటున్నాడు. నీవు నీ కుమారుని కలిసి పుష్యమి నక్షత్ర గురువారం నాడు ఆ స్వామిని దర్శింపవలసింది. నీకుమారునికి తప్పక విద్యాసంపద లభించగలదు. అని చెప్పారు. ఇది విన్న విష్ణుశర్మ ఎంతో సంతోషించి సాధువు వద్ద సెలవు తీసుకుని ఇంటికెళ్ళాడు.

తరువాత కొన్ని రోజులకు ఒక శుభముహూర్తాన భార్య, కుమారులతో కలిసి వేంకటాద్రి చేరుకున్నాడు. పుష్యమి నక్షత్ర గురువారం నాడు ఆనందనిలయంలో స్వామిని కుటుంబ సమేతంగా దర్శించుకున్నాడు. ఆనంద నిలయంలో స్వామిని దర్శించిన ఆ కుటుంబం ఆనందానికి అంతు లేదు. విష్ణుశర్మ ఆ పరబ్రహ్మమూర్తిని అనేక విధాల ప్రార్థించాడు. 'ఓ శ్రీనివాసా! శ్రీమన్నారాయణా! నీవు భక్తవత్సలునివి, అజ్ఞానమును నిర్మూలించువాడవు. సమస్తలోకమునకు ఆధారభూతుడవు. సర్వ జనులు చేసే కర్మలకు సాక్షీభూతుడవు నీవే. నీకివే నా నమస్కారములు. ఈ సృష్టి, స్థితి, లయ కారకుడవు నీవే. భక్తుల హృదయ కమలమును వికసింపచేసే నీకివే నా నమస్సులు. సర్వ మంగళ గుణ శీలుడవైన నీకివే నా నమస్కారములు. నీ నామమే సమస్త జనులకు సర్వమంగళ ప్రదమైనది. సర్వపాపములను హరించునది, దీర్ఘాయుష్షును ప్రసాదించునది, చింతా శోకములను నివారించునది, సర్వోత్తమమైనది, సత్యమైనది, నిత్యమైనదీ నీ నామమే కదా! నీ నామ మహిమచేతనే సర్వదేవతలకు వారి వారి

శక్తులు లభిస్తున్నాయి. అంతట మహోన్నతమూర్తివయిన నీకివే నమస్కారములు. దయచేసి నన్నూ, నా కుటుంబాన్ని అనుగ్రహింప వలసింది. నా కుమారునికి విద్యాబుద్ధులు అనుగ్రహింప వలసింది. నీవు తప్ప వేరే దిక్కు లేరు. తండ్రీ! నీవే శరణు. 'నీవు తప్ప వేరే దైవమును ఎరుగను' అని పరి పరి విధాల ప్రార్థించాడు. దర్శనా నంతరం ఆ కుటుంబం కొద్ది రోజులు కొండపైననే నివసించి తిరిగి తమ ఊరికి చేరుకున్నారు. శ్రీనివాసుని అనుగ్రహంతో వేంకట శర్మలో కొద్ది రోజులలోనే ఎంతో మార్పు వచ్చి, అనతి కాలంలోనే అన్నీ విద్యలూ నేర్చుకున్నాడు. అతనిలో కలిగిన మార్పుకు గురుకులంలోని ఉపాధ్యాయులందరూ ఎంతో సంతోషించారు. ఇదంతా శ్రీనివాసుని అనుగ్రహం తప్ప మరొకటి కాదని తలచి ఆ స్వామిని అనేక విధాలుగా ప్రార్థించారు.

శ్రీనివాసుడు భక్తసులభుడు. భక్తాధీనుడు, తన భక్తులు ఎటువంటి కోరికలు కోరినా వెంటనే తీర్చే ప్రసన్నమూర్తి. ఆ స్వామిని నమ్మిన వారికి సర్వ సౌభాగ్యాలూ, సర్వ ఐశ్వర్యాలూ, దీర్ఘాయుష్షు లభిస్తాయి.

ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "*



# ఆశ్లేష

నక్షత్ర సముదాయాలలో తొమ్మిదవదైన అశ్లేష నక్షత్రానికి అధిదేవత ఆదిశేషుడు. శ్రీమన్నారాయణుని ప్రథమ భక్తుడు ఆదిశేషుడు. ఆదిశేషుడు స్వామిని సర్వకాల సర్వావస్థలయందునూ ఎన్నోవిధాల సేవిస్తూ ఉంటాడు. పాల సముద్రంలో స్వామి శయనుడైనప్పుడు పరుపుగానూ, ఎండ, వానల వలన ఇబ్బంది కలగకుండా గొడుగుగానూ, భూలోకంలో స్వామి నివాసానికి వేంకటాద్రిగానూ, ఇలా స్వామిని ఎన్నో విధాల ఎప్పుడూ సేవిస్తూ ఉంటాడు.

శ్రీమన్నారాయణుడు త్రేతాయుగంలో శ్రీరామచంద్రునిగా అవతరించినప్పుడు ఆదిశేషుడే లక్ష్మణునిగా అవతరించాడు. శంఖ, చక్రాలు భరత శత్రుఘ్నులుగా జన్మించారు. దేవతలంతా తమ తమ అంశలతో వానరులుగా అంతరించారు.

శ్రీమన్నారాయణుడు శ్రీరామచంద్రునిగా అవతరించే సమయంలో బ్రహ్మదేవుడు దేవతలందరినీ పిలిచి ఇలా చెప్పాడు. సమస్తదేవతలారా!

నేను చెప్పేది సావధానంగా వినవలసింది. భూలోకంలో అనేక రాక్షసులు మునులను అనేక విధాల బాధిస్తున్నారు. రావణాసురుడనే రాక్షసుడు ఎంతో మంది పుణ్యాత్ములను అనేక విధాల హింసిస్తున్నాడు. శ్రీమన్నారాయణుడు వీరందరినీ సంహరించి ధర్మాన్ని కాపాడటం కోసమై శ్రీరామచంద్రునిగా అవతరిస్తున్నాడు. శ్రీమన్నారాయణుని భక్త పరాయణత్వము మీకు తెలియనది కాదు కదా! అతడు భక్తవత్సలుడు, భూలోకంలో ధర్మము నశించింది. ధర్మము సత్యము, న్యాయము, దానము, తపస్సు అనే నాలుగు విధాలుగా ఉంటుంది. భూలోకంలో ఋషులు, దుర్మార్గులు, దురాచారాలు ఎక్కువై ధర్మమార్గాన్ని విడనాడి దుర్భర జీవితాన్ని సాగిస్తున్నారు. అందుకే ధర్మరక్షణార్థం శ్రీరామచంద్రునిగా అవతరిస్తున్నాడు. మీరందరూ భూలోకంలో వానరులుగా మీమీ అంశలతో జన్మించి రావణ సంహారార్థం శ్రీమన్నారాయణునికి సహాయపడండి. ఇది మీ తక్షణ కర్తవ్యం. అని చెప్పాడు.

అప్పుడు దేవతలందరూ తమ తమ అంశలతో భూలోకంలో వానరులను సృష్టించారు. ఇంద్రుని అంశతో వాలి, సూర్యుని అంశతో సుగ్రీవుడు, బృహస్పతి అంశతో తీరుడు, కుబేరుని అంశతో గంధమాదనుడు, అగ్ని అంశతో నీలుడు, వరుణుని అంశతో సుషేణుడు, విశ్వకర్మ అంశతో నలుగురు, వాయుదేవుని అంశతో హనుమంతుడు జన్మించాడు. ఇలా దేవతలందరూ అనేక అంశలతో, దివ్య శక్తులతోనూ, అమిత పరాక్రమంతోనూ, దివ్య రూపాలతోనూ జన్మించి శ్రీరామచంద్రుడికి రావణ సంహారంలో ఎన్నో విధాల సహాయపడ్డాడు.

ఆ త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడిగా అవతరించిన శ్రీమన్నారాయణుడే నేటి శ్రీ వేంకటేశ్వరుడు. జీవులందరి హృదయాలలోనూ



ఉన్నది అంతర్యామి స్వరూపంలో ఉన్నది ఈ పరబ్రహ్మమూర్తియే. నిశ్చలంగా కనులు మూసుకుని ధ్యానిస్తే ఆ స్వామి రూపం మనందరి హృదయాలలో దివ్యంగా దర్శనమిస్తుంది.

శ్రీమన్నారాయణుడు సకల దేవతా స్వరూపుడు. ఈ విశ్వంలోని అన్ని దేవతలూ ఆ స్వామి రూపాలే. వేదాలన్నీ ప్రతిపాదించింది ఆ నారాయణ తత్త్వాన్నే. శ్రీ వేంకటతత్త్వాన్ని నిత్యం తలచే వారి జన్మ తరిస్తుంది. ఆ తత్త్వాన్ని నిత్యం తలుస్తుండటం, నిత్యం అర్చిస్తుండటం చేతనే బ్రహ్మ సృష్టి కార్యాన్ని నిర్విఘ్నంగా కొనసాగించగలుగుతున్నాడు. ఆ అమృత తత్త్వాన్ని ఇసుక రేణువువంత అర్థం చేసుకున్నా అమరత్వం సిద్ధిస్తుంది. మహా మునీశ్వరులందరూ ఎన్నో లక్షల సంవత్సరాల కొలది తపస్సు చేస్తున్నది ఆ తత్త్వాన్ని దర్శనం చేసుకొనడం కోసమే. నారాయణ తత్త్వం పరబ్రహ్మ రూపమై, కోటి సూర్య తేజోమయమై ప్రకాశిస్తున్నది. ఆ పరబ్రహ్మమూర్తియే కలియుగంలో తనను కొలచినవారికి కొంగు బంగారమై తిరుమలలో శ్రీ వేంకటేశ్వరునిగా వెలసాడు. ఆ స్వామిని నిత్యం స్మరించే వారికి సర్వ సౌభాగ్యాలూ, సర్వ ఐశ్వర్యాలూ సమకూరుతాయి. సంపూర్ణ ఆయుష్షుతో సుఖంగా జీవించి చివరన ముక్తిని పొందుతారు.

ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "*

# మఖ

నక్షత్ర సమూహంలో పదవదైన మఖా నక్షత్రానికి అధిపతి పితృదేవతలు. ఈ నక్షత్రంలోని నాలుగు పాదాలు సింహరాశిలోనికి వస్తాయి. శ్రీమన్నారాయణుడు నారసింహునిగా అవతరించి హిరణ్యకశిపుని సంహరించాడు. మఖ నక్షత్రంనాడు శ్రీనివాసుని తలచినా, దర్శించినా ఎంతో పుణ్యం కలుగుతుంది.

పూర్వకాలంలో మగధ దేశంలో విష్ణు శర్మ అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతనికి రామశర్మ, కృష్ణశర్మ అనే ఇద్దరు కుమారులు ఉండేవారు. పెద్దవాడైన రామశర్మ మంచి తెలివి గలవాడు. చిన్నవాడైన కృష్ణశర్మకు మాత్రం ఏ మాత్రం చదువు ఒంట పట్టలేదు. కేవలం పుట్టుకతో బ్రాహ్మణత్వమే తప్ప సద్బ్రాహ్మణులకు ఉండవలసిన ఏ మంచి అలవాట్లు లేవు. తండ్రి విష్ణు శర్మ ఎంత ప్రయత్నించినా చదువు ఏ మాత్రం ఒంట పట్టలేదు. చెడు సాంగత్యాలు చేసి ఎన్నో దురలవాట్లకు, దుర్వ్యసనాలను అలవాటు పడ్డాడు. కృష్ణశర్మను దారిలో పెట్టడానికి తండ్రి విష్ణుశర్మ



చేయని ప్రయత్నం అంటూ ఏమీ లేదు. ఎన్ని విధాల ప్రయత్నించినా ఏమీ లాభం లేకపోయింది. తాను నమ్మిన ఆ శ్రీమన్నారాయణుని ఎన్నో విధాల వేడుకున్నాడు. ఎప్పుడు నా మొర ఆలకిస్తావు తండ్రీ అని పరి పరివిధాల ప్రార్థించేవాడు. కానీ రోజులు గడుస్తున్నాయే తప్ప కృష్ణశర్మలో ఏ మాత్రం మార్పు రాలేదు. చదువు రాలేదు సరికదా, కనీసం దేవునికి ఒక నమస్కారం కూడా చేసేవాడు కాదు. ఏ దేవాలయాల జోలికి వెళ్లేవాడు కాదు. ఇటువంటి పుత్రుడిని కనటం తన పూర్వజన్మ ప్రారబ్ధంగా తలచి బాధ పడేవాడు విష్ణుశర్మ.

పెద్దవాడైన రామశర్మ మాత్రం ఎంతో చక్కగా చదువుకుని వేదపాఠశాలలో అధ్యాపకునిగా నియమించబడ్డాడు. కుమారులిద్దరికీ యుక్తవయస్సు వచ్చింది. కృష్ణశర్మ సంగతి తెలిసిన ఊళ్లోవారెవ్వరూ ఆ ఇంట్లో తమ పిల్లని ఇవ్వడానికి సుముఖంగా లేరు. అటువంటి దుర్మార్గుడు ఇంట్లో ఉన్నప్పుడు తమ ఆడపిల్లకి ఏమి అన్యాయం జరుగుతుందో అని పెద్దవాడైన రామశర్మకి కూడా పిల్లనివ్వడానికి జంకేవారు. తల్లిదండ్రులు ఈ విషయం తెలిసి ఎంతో బాధపడేవారు. చిన్నవాడి దుర్మార్గపు చేష్టల మూలంగా పెద్దవాడైన రామశర్మకి ఎంత కాలానికీ పెళ్లి నిశ్చయం కాకపోవటం ఆ దంపతులను ఎంతో దిగులుకు గురి చేసింది.

ఇలా గడుస్తుండగా ఒకనాడు తండ్రి విష్ణుశర్మకి ఎనలేని బాధ, ఆ బాధతోపాటు కృష్ణశర్మపై విపరీతమైన కోపం వచ్చాయి. అప్పుడు రాత్రి పదిగంటల సమయం అవుతోంది. బయట జోరుగా వాన కురుస్తున్నది. హోరున గాలి వీస్తోంది. పూర్తిగా గాఢాంధకారంగా ఉంది. కొడుకు ఈ విధంగా అయ్యాడన్న బాధలో ఇవేమీ లెక్క చేయకుండా తక్షణం ఇంట్లోనుంచి వెళ్ళిపొమ్మని కృష్ణశర్మని కోపగించుకున్నాడు. తల్లి ఎంత వారించినా

వినలేదు. ఈ చీకట్లో ఎక్కడికి పోతాడు, రేపు పొమ్మనండి అని ప్రాధేయపడింది. కానీ భర్త వినలేదు. ఆ తండ్రి అంతగా విసుగెత్తి ఉన్నాడు. ఆ రాత్రివేళ, అంత వర్షంలోనూ కృష్ణశర్మను ఇంటిలోనుంచి గెంటివేశాడు.

వర్షంలో తడుస్తూ కృష్ణశర్మ ఊరి బయటకు వచ్చి పెద్ద చెట్టుకింద నిల్చున్నాడు. వర్షం తగ్గితే తెల్లవారగానే ఇంటికివెళ్ళి తండ్రిని ప్రాధేయపడవచ్చునని అనుకున్నాడు. తండ్రి శాంతించకపోతాడా అని అతని ఆలోచన. కానీ వర్షం ఇంకా పెద్దది కాసాగింది. ఆ రోజు పౌర్ణమి అయినప్పటికి గాడాంధకారంగా ఉంది. ఉరుములు, మెరుపులతో వాతావరణం భయంకరంగా ఉన్నది. ఈ వర్షానికి ఈ చెట్టుకూడా కూలి తన నెత్తిమీద ఎక్కడ పడుతుందో అని భయం పట్టుకుంది. విష్ణుశర్మ ఇక్కడనుంచి బయట పడితే తప్ప గత్యంతరం లేదనుకున్నాడు, కానీ ఎక్కడికని వెళ్ళాలి అని ఆలోచిస్తుండగా ఎదురుగా కొద్ది దూరంలో ఉన్న కేశవ స్వామి దేవాలయం గుర్తుకు వచ్చింది. అక్కడ వెళితేనో అని మనసులో అనుకున్నాడు. కానీ దేవాలయంలోనికి ఇంతకుముందెప్పుడూ వెళ్ళకపోవడం చేత మనసొప్పలేదు. ఛీ! దేవాలయంలోనికి తల దాచుకోవడానికి వెళ్ళడమా, ఏ మాత్రం కుదరదు, ఈ చెట్టుకింద చావనైనా చస్తాను కానీ గుడిలోనికి మాత్రం వెళ్లకూడదని నిశ్చయించుకున్నాడు.

కానీ ఇలా అనుకున్నాడే కానీ, మనిషికి మృత్యుభయం ఇంతటిది, అంతటిది కాదు కదా! మనిషి జీవితంలో మృత్యువుకి భయపడ్డట్టు దేనికీ భయపడడు. ఎంతటి వాడికైనా ఇది తప్పదని తెలిసినా మనిషికి ఈ భయం ఎన్నడూ వెన్నంటే ఉంటుంది. ఎంతటి దుర్మార్గుడైనా మృత్యువంటే భయపడతాడు. కృష్ణశర్మ విషయంలోనూ సరిగ్గా ఇదే జరిగింది. తాను



నుంచున్న చెట్టుకి అతి సమీపంలో పెద్ద శబ్ధంతో పిడుగు పడింది. ఆ శబ్దానికి కృష్ణశర్మకి పై ప్రాణాలు పైనే పోయాయి. ఒక్క క్షణంలో చెట్టుకిందనుంచి ఆలయంలోనికి పరిగెత్తాడు. ఇంతకు మునుపటి ఆలోచన మారింది. దేవాలయం అయితేనేం ముందు ప్రాణం ముఖ్యం అని తలచాడు.

కేశవ స్వామి దేవాలయం చాలా చిన్నది. చుట్టూ ప్రహరీ కూడా లేదు. దాదాపు రాత్రి పన్నెండు గంటలు కావడంతో దాదాపుగా చిమ్మచీకటి ఈ గాడాంధకారంలో ఏ పామైనా తనను కాటేస్తే... అమ్మో ఈ ఊహ రాగానే కృష్ణశర్మకి భయం ఇంకా ఎక్కువైంది. ఎలాగైనా ఏదైనా దీపం వెలిగించుకోవాలి, లేకపోతే కష్టమే. అని కంగారుగా ఆ చీకట్లోనే అటూ ఇటూ తడిమితే అగ్గి దొరికింది. దానితో అక్కడ ఉన్న దీపం వెలిగించాడు. దీపంలో నూనె ఎక్కువగా లేదు. అమ్మో ! కాసేపట్లో ఈ దీపం ఆరిపోతేనో అని తలచి గుడిలోపల అన్ని మూలలా వెతకగా ఒక చోట పాత నూనె సీసా కనిపించింది. ఆ సీసా నుంచి నూనె తీసి దీపం నిండా పోశాడు. దీపం దివ్యంగా వెలిగింది. తల తిప్పిన కృష్ణశర్మకు ఆ దీపం వెలుగులో కేశవ స్వామి అద్భుత రూపం కనిపించింది. ఆ అద్భుత సౌందర్యానికి కృష్ణశర్మ కళ్ళు చెదిరిపోయాయి. ఒక విధమైన మగత కూడా వచ్చింది... వెంటనే ఒక ప్రక్క గోడకు ఆనుకుని ఆ రూపాన్నే చూస్తూ సర్వం మరిచిపోయాడు. మెల్లగా తనకు తెలీకుండానే నిద్రలోకి జారుకున్నాడు.

తెల్లవారే సరికి ఆ ఆలయ అర్చకస్వామి వచ్చి గుడిలో నిద్రపోతున్న కృష్ణశర్మను చూసాడు. భుజం తట్టి నిద్రలేపాడు. నిద్రలేచిన కృష్ణ శర్మ ఒక్క ఉదుటున బయటకు వచ్చి కోనేటిలో స్నానం చేసి స్వామి ముందు నిల్చుని దివ్య ప్రబంధాలన్నీ గానం చేయసాగాడు. కృష్ణశర్మ సంగతి తెలిసిన అర్చకుల వారికి ఇదంతా అంతు బట్టటం లేదు. అక్షరం ముక్క

రాని కృష్ణశర్మేనా. ఇన్ని దివ్యప్రబంధాలు ఆలకిస్తున్నది అని ఆశ్చర్యచకితుడై ఒక్క ఉదుకున ఊరిలోకి పరిగెత్తి తండ్రి విష్ణుశర్మకి ఈ విషయం చెప్పాడు. విష్ణుశర్మకు ఏ మాత్రం నమ్మబుద్ధి కాలేదు. ఇద్దరూ కలిసి వడి వడిగా నడుస్తూ గుడివద్దకు చేరుకున్నారు. అక్కడ అద్భుతమైన తేజస్సుతో వెలిగిపోతూ కేశవస్వామికి ఎదురుగా నిల్చుని దివ్యప్రబంధాలను గానం చేస్తున్న కృష్ణశర్మను చూసి ఆశ్చర్యపోయారు. కళ్ళనీళ్ళ పర్యంతం అయింది. ఒక్కరోజు కూడా పాఠశాలకు వెళ్ళని తన కుమారుడికి ఒక్క రాత్రిలోనే ఇంత మార్పు ఎలా వచ్చిందో తండ్రికి అంతు పట్టలేదు. అంతలో కుమారుడు తండ్రి కాళ్ళపై పడి రాత్రి జరిగినదంతా పూస గుచ్చినట్లు వివరించాడు.

విష్ణుశర్మకి అప్పుడు అంతా అర్థమైంది. నిన్న రాత్రి మాఘ పౌర్ణమి. మఖ నక్షత్రంతో కూడిన పౌర్ణమి. ఆ సమయంలో తన కుమారుడు కృష్ణ శర్మ తనకు తెలియకుండానే స్వామికి దీపం వెలిగించాడు. మాఘ మాసంలో పౌర్ణమినాడు, మఖ నక్షత్రంలో స్వామిని దర్శించడమే కాకుండా దీపం కూడా వెలిగించడంతో కృష్ణశర్మ చేసిన వేల జన్మల పాపమంతా క్షణంలో నశించింది. స్వామి అనుగ్రహంతో సర్వ వేదాల సారమూ, సర్వ శాస్త్ర విజ్ఞానమూ క్షణంలో కలిగాయి.

శ్రీమన్నారాయణుడు అంతటి అమృతమూర్తి. తన భక్తులంటే శ్రీనివాసునికి వల్లమాలిన ప్రేమ. భక్తుడు తన గురించి తపించే కంటే తాను వారి గురించి, వారి సౌభాగ్యం గురించి ఎప్పుడూ తపిస్తాడు. తన భక్తుడు ఎంత దుర్మార్గుడైనప్పటికీ ఒక చిన్న సేవ తనకు చేసినా, తన భక్తులకు చేసినా కొండంత సంతోషించి, సర్వ భాగ్యాలూ, సర్వ సంపదలూ



అనుగ్రహిస్తాడు. అంతటి అమృతమూర్తిని మనందరమూ మఖ నక్షత్రం నాడు స్మరించి, దర్శించి, జన్మ ధన్యం చేసుకోవాలి.

ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "*

# పూర్వా ఫల్గుణి

పుబ్బా అని పిలువబడే పూర్వా ఫల్గుణి నక్షత్రం కంటి ద్వయం ఆకారంలో కనిపించే రెండు నక్షత్రాలలో ఒకటి. రెండవది ఉత్తరా ఫల్గుణి. పుబ్బా నక్షత్రానికి అధిపతి ఆర్యముడు. జగన్మాత నక్షత్రం కూడా పుబ్బయే కావటం విశేషం.

పుబ్బా నక్షత్రం నాడు శ్రీమన్నారాయణుని తలచినా, దర్శించినా తలపెట్టిన పనులన్నీ నిర్విఘ్నంగా కొనసాగుతాయి. వివాహం కాని కన్యలు ఈ నక్షత్రంలో స్వామిని స్మరించినా, దర్శించినా వెంటనే వివాహం జరుగుతుంది. శ్రీనివాసుని అనుగ్రహం తక్షణమే పొందదానికి పూర్వా ఫల్గుణి నక్షత్ర సమయంలో స్వామిని దర్శించటం సులభసాధనం.

పూర్వకాలంలో ఒకనాడు నారదుడు లోకసంచారం చేస్తూ వైకుంఠానికి వచ్చాడు. నారదుడు వచ్చే సరికి శ్రీమన్నారాయణుల వారు కనులు మూసుకుని ధ్యానముద్రలో పెదవులపై చిరునవ్వుతో వున్నారు. నారదుడు కాసేపు అక్కడే వేచి నుంచున్నాడు. కొంతసేపైన తరువాత స్వామివారు



కనులు తెరిచి “ఓ నారదా! నీవు వచ్చి ఎంతసేపైంది? కుశలమే కదా! అని పలకరించాడు. అప్పుడు నారదుడు ‘స్వామీ! మీ దయవలన అన్ని లోకాలు క్షేమంగా వున్నాయి. ప్రజలందరూ సుఖసంతోషాలతో వున్నారు. ఇంతకీ తమరు ఏదో దీర్ఘాలోచనలో వున్నట్టు కనిపిస్తున్నారు. అదేమిటో నేను తెలుసుకొనవచ్చునా అని అడిగారు. అప్పుడు స్వామివారు ఓ తప్పకుండా. నేను ప్రస్తుతం భూలోకంలో వున్న ఒక భక్తుని గురించి ఆలోచిస్తున్నాను అన్నాడు.

అప్పుడు నారదుడు స్వామివారితో ‘ఆహా! ఆ భక్తుడు ఎంతటి అదృష్టవంతుడో కదా స్వామీ! నీ దృష్టిలో ప్రత్యేకించి పడిన ఆ భక్తాగ్రేసుడెవరో తెలుసుకోవాలని నాకెంతో ఉబలాటముగా ఉన్నది. దయచేసి ఆ భక్తుడెవరో నాకు చెప్పవలసింది అన్నాడు. అప్పుడు శ్రీమన్నారాయణుడు భూలోకంవైపు చేయి చూపుతూ నారదునితో అక్కడ ఒక పొలంలో మధ్యాహ్నపువేళ కాళ్ళు కడుక్కుని తనవెంట తెచ్చుకున్న అన్నం మూట తెరచి తినడానికి ఉపక్రమిస్తున్న సామాన్యరైతును చూపించాడు. ఆ రైతు ఒక ముద్ద తీసుకుని నారాయణా అని తలుస్తూ తినడం ప్రారంభించాడు. అప్పుడు నారదుడు స్వామీ! ఇంతకీ ఈ సామాన్య బక్కచిక్కిన రైతు మీ ఆలోచన భాగ్యానికి నోచుకున్నది. నేను ఇంకెవరో పరమ భక్తాగ్రేసరుడో, పరమ పావన మునీంద్రుడో, ఆచార్య పురుషోత్తముడో అనుకున్నాను. ఇంతటి సామాన్య రైతు గురించా మీరు ఆలోచిస్తున్నది! అని అన్నాడు. అప్పుడు స్వామివారు నారదునితో అవును నారదా! ఈ ముల్లోకాలలోని భక్తులలో నాకు ఈ భక్తుడన్న ఎంతో ప్రేమ, అని అన్నాడు. నారదునికి ఇది చాలా ఆశ్చర్యం కలిగించింది. ఎల్లప్పుడు నారాయణ మంత్రం జపించే తనకంటే ఏ యజ్ఞ యాగాదులూ చేయని, ఏ నోములూ, వ్రతాలూ నోచని, ఏ పూజలూ తెలియని ఒక సామాన్య మానవుడు స్వామివారికి ప్రియ భక్తుడా! పొలం

దున్నుకోవడం తప్ప ఒక మంత్రం అయినా రాని ఇతడా స్వామికి ప్రియ భక్తుడు అని తలచి, ఇదే సందేహాన్ని శ్రీమన్నారాయణులవారితో అన్నాడు. అప్పుడా జగన్నాథుడు చిరునవ్వుతో 'నారదా! నీ సందేహాలకు తప్పక సమాధానం చెప్తాను. అంతటి సామాన్య మానవుడు నాకెందుకు ప్రియభక్తుడు అయినాడోనని నీకు అనుమానం కదా! తప్పక వివరిస్తాను. కానీ నువ్వు ఒక చిన్న పని చెయ్యవలసింది' అని నారదుని చేతికి ఒక చిన్న నూనెతో నిండిన పాత్ర చేతికిచ్చి ఇలా చెప్పసాగాడు. ఓ నారదా! నువ్వు ముల్లోకాలు తిరుగుతున్నప్పుడు ఈ రోజంతా ఈ పాత్రను చేతిలో పట్టుకుని ఎక్కడా కింద పెట్టకుండా సాయంత్రం నా వద్దకు రావలసింది. అప్పుడు నీ సందేహానికి సమాధానం చెప్తాను. కానీ ఒక్క షరతు ఈ పాత్రలోని నూనె ఒక చుక్క కూడా బయట పడకూడదు. ఏ మాత్రం తొణకకుండా ఉండాలి. ఒక్క నూనె చుక్క బయటకు పడినా, నీకు సమాధానం రాదు అని చెప్పాడు.

అప్పుడు నారదుడు ఆ పాత్ర తీసుకుని శ్రీమన్నారాయణునితో 'ఓహో ఇంతే కదా స్వామీ! ఇదేమంత గొప్ప విషయమా! ఒక్క నూనె చుక్క కూడా తొణకకుండా సాయంత్రం మిమ్మల్ని కలుస్తాను. ఆ రైతు మీకు ప్రియభక్తుడు ఎలా అయినాడో తెలుసుకోవాలని నాకు చాలా ఆత్రంగా ఉన్నది! అని చెప్పి ఆ పాత్రను చేత్తో పట్టుకుని స్వామి వారి వద్ద తెలుసుకుని లోకసంచారానికి తిరిగి ప్రయాణమైనాడు. శ్రీ మహావిష్ణువులవారు చిరునవ్వు నవ్వుతూ తిరిగి ధ్యానముద్రలోకి వెళ్ళారు.

సాయంకాలం అయింది. నారదుడు ఆపసోపాలు పడుతూ ఆ పాత్రను చేత్తో పట్టుకుని స్వామివద్దకు వచ్చాడు. స్వామిని చూసిన శ్రీమన్నారాయణులవారు చిరునవ్వుతో 'ఏం నారదా! నీ పాత్రలోని నూనె బయటకు పడలేదు కదా, నీ లోక సంచారం అంతా ఏ ఇబ్బందీ లేకుండా



జరిగింది కదా అని అడిగాడు. అప్పుడు నారదుడు 'స్వామీ! బాగానే జరిగింది. ఒక్క నూనె చుక్క కూడా తొణకలేదు. కానీ ఏమిటీ విచిత్ర పరీక్ష అని అన్నాడు. అప్పుడు శ్రీమన్నారాయణులవారు చిరునవ్వుతో నారదుని ఇలా అడిగాడు. నారదా! నాదొక చిన్న ప్రశ్న. మధ్యాహ్నపు వేళ ఈ పాత్ర నీకు ఇచ్చినప్పటినుంచి ఇప్పటిదాకా నన్ను ఎన్నిసార్లు తలచుకున్నావో చెప్పగలవా. విని సంతోషిద్దామని వున్నది అన్నాడు. అప్పుడు నారదుడు 'భలే వాడివి స్వామీ! మిమ్మల్ని తలచుకోవడం కూడానా! ఒక్కసారి కూడా తలచుకోలేదు. నాకింత కఠిన పరీక్ష పెట్టితిరి. నా మనస్సంతా ఈ పాత్రమీదనే ఉంది. రోజంతా నూనె ఎక్కడికి బయటికి చిమ్ముతుందో అనే ఆందోళనలో ఉంటే ఇంక మిమ్మల్ని ఎక్కడ తలచుకోగలను? అని అన్నాడు.

అప్పుడు స్వామి చిరునవ్వు నవ్వుతూ 'చూశావా నారదా! నీకు ఒక చిన్న పని చెప్పేటప్పటికే నన్ను మరచిపోయావు. సర్వకాల సర్వావస్థలయందు నా నామ స్మరణ చేసే, ఏ సంసార జంజాటమూ లేని నీవు ఇంత చిన్న పనికే నన్ను మరచిపోయావు కదా. మరి ఆ సామాన్య రైతు మాటేమిటి. గంపెడు సంసారం... వారి పోషణ... చదువులు... పెళ్ళిళ్ళు... ఇలా ఎన్నో సమస్యల్లో కూరుకుని పోయి వుండి ఆ సామాన్య రైతు మధ్యాహ్నం రెండు మెతుకులు తినేముందు ప్రశాంత మనసుతో "నారాయణా" అని నన్ను తలచుకున్నాడు. మరి ఇప్పుడు చెప్పు అతడు 'నా ప్రియభక్తుడు కాక మరెవరవుతాడు? నాకు గల భక్త వాత్సల్యత నీకు తెలియనది కాదు కదా! నా అనుగ్రహం పొందడానికి యజ్ఞాలూ, యాగాలూ అవసరం లేదు. కఠోర నియమనిష్టలతో చేసే పూజలూ అవసరం లేదు. ప్రశాంత మనస్సుతో నిర్మల జీవితం గడుపుతూ రోజులో నన్ను ఒక్కసారి స్మరించినా వారి పూర్తి బాధ్యత నేనే వహిస్తాను. ధనం ఉన్నది

కదా అని ఎంతో అహంకారంతో నలుగురిలోనూ గొప్ప కోసం చేసే యజ్ఞయాగాదులకంటే అతి పేదవాడైన భక్తుడైనను ఒక్కసారి గోవిందా అని తలిస్తే వెయ్యి రెట్లు ఫలం ఇస్తాను. నా భక్తులకష్టాలన్నీ నాకు తెలుసు. వారికున్న పరిమితులన్నీ కూడా నాకు తెలుసు. కొంతమంది భక్తులు సంసార సుడిగుండంలో చిక్కుకుని నాకు ఏ పూజలూ చేయలేకపోతున్నానే అని బాధ పడుతుంటారు. వారేమీ చింతించనవసరం లేదు. వారు రోజులో ఒక్కసారి నన్ను తలచినా వారి బాధ్యత నేనే వహిస్తాను. సర్వ సంపదలూ అనుగ్రహిస్తాను. ఎంతో ధనం ఖర్చు పెట్టి అహంకారంతో యజ్ఞ యాగాదులు చేసేవారి కంటే ఒక చిన్న పుష్పాన్ని వినమ్రంగా, ఆప్యాయతతో నాకు సమర్పించేవారంటేనే నాకు అత్యంత ప్రీతి అని శ్రీమన్నారాయణులవారు సెలవిచ్చారు.

అప్పుడు నారదుడు 'స్వామీ! నన్ను క్షమించండి. పూర్తి అజ్ఞానంతో నేనే గొప్ప భక్తుడననుకొని చాలా మూర్ఖంగా ఆలోచనలు చేశాను. నన్ను క్షమించి అనుగ్రహింపవలసింది' అని స్వామిని పరిపరివిధాల ప్రార్థించి స్వామివద్ద శెలవు తీసుకుని తిరిగి లోక సంచారానికి పయనమయ్యాడు.

శ్రీనివాసునికి తన భక్తులంటే అంతటి ప్రేమ. వారి వారి దైనందిన కార్యక్రమాలలో మునిగిపోయి తనను గురించి ఆలోచించక పోయినా సన్మార్గంలో జీవించే వారైతే రోజులో ఒక్కసారి తలచుకున్నా వారిని పూర్తిగా అనుగ్రహించే అమృతమూర్తి శ్రీమన్నారాయణుడు. అంతటి దయామయుడైన ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్
శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "



# ఉత్తర ఫల్గుణి

ఉత్తరా నక్షత్రానికి అధిపతి. ఉత్తర నక్షత్రానికి అధిపతి భృగుడు. ఉత్తర శ్రీమన్నారాయణుని ప్రియపత్ని లక్ష్మీదేవి నక్షత్రం.

దేవదానవులు క్షీర సాగర మధనం చేసినప్పుడు అందులోనుంచి ముందుగా హాలాహలం పుట్టింది. దానిని శివుడు మింగి తన గళంలో వుంచుకున్నాడు. ఆ తరువాత కామధేనువు పుట్టింది. దీనిని బ్రహ్మ తీసుకున్నాడు. అటు తరువాత ఉచ్ఛైశ్రవము ఉద్భవించింది. దీనిని బలిచక్రవర్తి తీసుకున్నాడు. ఇంకా మధించగా ఐరావతం వచ్చింది. దీనిని ఇంద్రుడు తీసుకున్నాడు. ఆ పిమ్మట వచ్చిన కౌస్తుభాన్ని శ్రీ మహావిష్ణువు ఇష్టపడి తీసుకున్నాడు. ఇంకా చిలుకుతుండగా పారిజాతము, కల్పవృక్షము, ఉద్భవించాయి. ఈ రెండింటినీ ఇంద్రుడు తీసుకున్నాడు.

అటు తరువాత క్షీర సముద్రం నుంచి లక్ష్మీదేవి ఉద్భవించింది. ఆ తల్లి సౌందర్యం ఇంతా, అంతా అని వర్ణించ అలవి కానిది. అద్భుత సౌందర్యరాశి అయిన శ్రీ మహాలక్ష్మిని చూసి దేవదానవులందరికీ నోట

మాట రాలేదు. అక్కడ ఉన్న వారందరూ ఆ మనోహర మూర్తిని అనేక విధాల సేవించారు. దేవేంద్రుడు ఆమెకు ఆసనం సమర్పించాడు. సముద్రుడు అద్భుత వస్త్రాలను ఇచ్చాడు. వరణుడు వైజయంతీ మాలను సమర్పించాడు. సరస్వతి ముత్యాల హారాన్ని బహూకరించింది. బ్రహ్మదేవుడు అద్భుతమైన పద్మాన్ని ఇచ్చాడు.

అప్పుడు శ్రీ మహాలక్ష్మీదేవి తామర పూలమాలను చేతిలో తీసుకుని అద్భుత తేజస్సుతో వెలిగిపోతూ తన భర్త మెడలో ఈ మాలను వేసి వరించాలని నడిచి రాసాగింది. అక్కడ ఉన్న వారందరూ ఈ అద్భుత సౌందర్యరాశి ఎవరి మెడలో ఈ మాలను అలంకరించి భర్తగా స్వీకరిస్తుందా అని ఆత్రంగా చూడసాగారు. ఆమె ఒక్కొక్కరిని పరికించి చూస్తూ చివరికి శ్రీ మహావిష్ణువు వద్దకు రాగానే అక్కడే ఆగి, ఇతడే తనకు భర్తగా నిర్ణయించుకుని ఆ స్వామి మెడలో మాలను వేసింది. శ్రీమన్నారాయణుడు చిరునవ్వుతో శ్రీ మహాలక్ష్మిని భార్యగా స్వీకరించి తన హృదయంలో స్థానం కలిపించాడు. అక్కడ వున్న వారందరూ ఎంతో సంతోషపడ్డారు. దేవ దుందుభులు మ్రోగాయి. అందరూ శ్రీలక్ష్మీనారాయణులను ఎన్నోవిధాల స్తుతించారు.

ఆ విధంగా "శ్రీ"ని తన వక్షస్థలంలో ధరించిన శ్రీమన్నారాయణుడే మన శ్రీనివాసుడు. వక్షస్థల మహాలక్ష్మితో తన భక్తులందరకూ అమితమైన ఆనందాన్ని కలుగజేసేది ఈ శ్రీనివాసుడు. ఒక్క క్షణం కూడా విడవకుండా శ్రీమహాలక్ష్మి శ్రీమన్నారాయణుని హృదయంలో దివ్యంగా వసిస్తున్నది. అందుకే శ్రీమన్నారాయణుడు సర్వ ఐశ్వర్యాలకూ, సర్వ భోగాలకూ నిలయమైన వాడైనాడు. లక్ష్మిని హృదయంలో ధరించిన శ్రీనివాసుడు కళ్యాణ నిధియై వెలుగొందుతున్నాడు. అందుకే ఆ స్వామిని అర్చించినవారికి సర్వ ఐశ్వర్యాలు లభిస్తాయి.



అన్ని అవతారాలలోనూ శ్రీ మహాలక్ష్మి శ్రీమన్నారాయణులవారితోనే వెన్నంటి ఉన్నది. శ్రీ మన్నారాయణుడు దేవతా రూపం ధరించినప్పుడు దేవతగానూ, మానవ రూపం ధరించినప్పుడు మానవస్త్రీగానూ జన్మించి ఎప్పుడూ సహచరిగా వున్నది. వారి అన్యోన్యత లోకాలన్నింటికీ ఆదర్శము, మహదానందము.

తిరుమలలో రోజూ జరిగే శ్రీ లక్ష్మీ శ్రీనివాసుల కళ్యాణం జగత్కళ్యాణమే. ఆ దంపతులిద్దరూ పరస్పరమూ ఒకరిపైనొకరికి అత్యంత అనురాగము కలవారు. శ్రీ మహాలక్ష్మిని హృదయంలో ధరించిన శ్రీనివాసుడు పరమ దయాస్వరూపుడు. పరమానందపురుషుడు. పురుషులలో ఉత్తముడు. అతని తేజస్సు వర్ణింపశక్యము కానిది. సూర్యుడు, చంద్రుడు, అగ్నిలోని తేజస్సంతా ఆ స్వామినుండే ఉద్భవించింది.

శ్రీమన్నారాయణునికి తనభక్తులంటే అలవిమాలిన ప్రేమ. అందువలననే ఎక్కడో వైకుంఠంలో ఉంటే కేవలం ఆ దేవతలకు మాత్రమే లభ్యమవుతానని గ్రహించి, ఈ భూలోకంలోని తన భక్తులందరినీ సంతోష పెట్టడానికి ఎన్నో అవతారాలలో ఆవిర్భవించాడు. త్రేతాయుగంలో శ్రీరామునిగా, ద్వాపరయుగంలో శ్రీకృష్ణునిగా, జన్మించి తన భక్తులందరినీ ఎన్నో విధాల ఆదుకున్నాడు. ఎన్నో విధాల సంతోషపరిచాడు. ఇంతే కాదు, ఈ కలియుగంలో ఎన్నో దేవాలయాలలో ఎన్నో అంశలతో మనందరికి చేరువలో వుండి మనందరికీ ఎంతో సంతోషం కలిగిస్తున్నాడు.

ఆ స్వామికి తన భక్తులంటే అలవిమాలిన ప్రేమ. తిరుమల తన దర్శనార్థం వచ్చేవారికి అన్ని సదుపాయాలు తానే కలిగిస్తున్నాడు. వారందరూ తనను దర్శించడానికి ఆనంద నిలయంలోనికి రావడం చూసి ఎంతో సంతోషపడి వారికి సర్వసౌభాగ్యాలూ, సర్వ ఐశ్వర్యాలూ అనుగ్రహిస్తాడు.

ఆ అమృతమూర్తిని నమ్మి కొలచినవారిని ఏ లోటూ ఉండదు. ఎటువంటి ఆపదలూ దరిచేరవు. ఏ పని తలపెట్టినా నిర్విఘ్నంగా, విజయవంతంగా సాగుతుంది. ఆ స్వామిని నమ్మి, స్వామిపైనే పూర్తి భారం వేసేవారి జీవితం ఎల్లప్పుడూ సుఖప్రదంగా గడుస్తుంది. తనను ఆశ్రయించినవారికి సర్వ సంపదలనూ అనుగ్రహించే దివ్య మంగళ స్వరూపుడు ఆ శ్రీనివాసుడు. తనను నమ్మినవారికి పూర్తిగా వశమయ్యేవాడు. భక్తసులభుడు శ్రీమన్నారాయణుడే. అతడు భక్తుల హృదయాలలో ఎల్లప్పుడూ బందీగా సంతోషంగా నివసిస్తాడు.

ఓ శ్రీనివాసా! నీవు మాకు అండగా ఉండగా భయమేలనయ్యా! నీకివే మా నమస్కారములు. శ్రీలక్ష్మీ శ్రీనివాసులారా! మీకివే మా నమస్కారములు! ఓ శ్రీనివాసా! సర్వకాల సర్వావస్థలయందు మా మనస్సు నీ అందే ఉండునటుల మమ్ము కరుణించవయ్యా ! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ అమృతమూర్తీ నీకివే మా ప్రణామములు. ఓ జగద్రక్షకా నీకివే మా నమస్కారములు.

ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "*



# హస్త

హస్తా నక్షత్రానికి అధిపతి సూర్యభగవానుడు. సమస్త జీవకోటికి ఆధారభూతుడైన సూర్యనారాయణుడు శ్రీమన్నారాయణుని స్వరూపమే. పన్నెండు మాసాలలో పన్నెండు పేర్లతో సంచరిస్తూ ఉండే సూర్యభగవానుడు ద్వాదశాత్ముడు అనబడుతున్నాడు. చైత్రమాసంలో ధాతగానూ, వైశాఖమాసంలో ఆర్యమునిగానూ, జ్యేష్ఠ మాసంలో మిత్రుడిగానూ, ఆషాఢమాసంలో వరుణునిగానూ, శ్రావణంలో ఇంద్రునిగానూ, భాద్రపదంలో వివస్వంతునిగానూ, ఆశ్వయుజ మాసంలో పూష అనే నామంతోనూ, కార్తీకంలో పర్జన్యునిగానూ, మార్గశిరంలో అంశు మంతునిగానూ, పుష్యంలో భగునిగానూ, మాఘంలో త్వష్ట అనే పేరుతోనూ, ఫాల్గుణంలో విష్ణువుగానూ ఆరాధించబడుతున్నాడు. ఈవిధంగా ప్రత్యక్ష భగవానుడైన సూర్యుడు నెలకొకరూపాన్ని ధరిస్తూ ఈ సకల జీవకోటికి చైతన్యాన్ని ప్రసాదిస్తున్నాడు.

పూర్వకాలంలో ప్రహ్లాదుని రక్షించడానికి శ్రీమన్నారాయణులవారు

నరసింహావతారం ఎత్తి హిరణ్యకశిపుని సంహరించాడు. సంహరించిన అనంతరం ఉగ్రరూపంతో వెలిగిపోతున్న శ్రీ నరసింహమూర్తిని ప్రహ్లాదుడు అనేక విధాలుగా స్తుతించి శాంతపరిచాడు. అప్పుడా నరసింహ రూపము రెండు రూపాలుగా ఉద్భవించింది. నరరూపం నరుడుగానూ, సింహ రూపం నారాయణునిగానూ ఆవిర్భవించింది. వీరే నరనారాయణులు. వీరిద్దరూ బదరీ వనంలో తపస్సు చేస్తుండగా వీరి తపస్సు భంగం చేయడానికి ఇంద్రుడు అప్సరసలను పంపించాడు. వారెన్నో విధాల ఆటపాటలాడి తమ అద్భుత సౌందర్యంతో నర నారాయణుల తపస్సును భంగం చేయాలని ప్రయత్నించారు. ఎన్ని విధాల ఆటపాటలాడినప్పటికి వారి తపోభంగం చేయడం వీరి వల్ల కాలేదు. నారాయణుడు తన చేతిలో ఒక దర్భను తీసుకుని ఒకసారి తొడమీద వ్రాచాడు. వెంటనే నారాయణుని తొడనుంచి అద్భుత సౌందర్యరాశి ఆవిర్భవించింది. ఊరువు నుండి జన్మించినది కాబట్టి ఊర్వశి అని పిలువబడింది. ఈ అద్భుత సౌందర్యరాశిని చూసిన అప్సరసలు సిగ్గు పడి దేవలోకానికి తిరిగి వెళ్ళిపోయారు.

నారము అంటే నీరు. నీటి నుంచి ఉద్భవించినవాడు, నీటియందే శేషతల్పసాయిగా ఉండేవాడు నారాయణుడు. సృష్టి ప్రారంభంలో పరమపురుషుడైన శ్రీమన్నారాయణుడే ప్రాణులన్నింటిని సృష్టించాడు. ఆ స్వామి సంకల్పంచేతనే పంచభూతాలు, బ్రహ్మాది దేవతలు, సప్త ఋషులు, ఇంద్రుడు, సూర్యుడు, చంద్రుడు వంటి వారందరూ ఆవిర్భవించారు.

ఆ శ్రీమన్నారాయణుని తేజస్సు మహాశక్తివంతమైనది. సూర్యునియందుండే తేజస్సుకు మూలకారకుడు ఈ పరబ్రహ్మమూర్తియే. ఆ తేజస్సే విష్ణుస్వరూపమై భాసిల్లుతున్నది. తిరుమల బ్రహ్మోత్సవాలలో శ్రీనివాసుడు సూర్యప్రభ వాహనంపై ఊరేగుతూ భక్తులకు అమితానందాన్ని కలుగజేస్తాడు.



ఈ సృష్టికి కారణభూతుడైనవాడు, సర్వ శ్రేష్ఠుడు, సర్వాభీష్ట ప్రదాత, సకల పాపరహితుడు, సర్వ వ్యాపకుడు అయిన శ్రీమన్నారాయణుడు తిరుమలలో శ్రీ వేంకటేశ్వరునిగా వెలసి కలియుగంలో తనను నమ్మి కొలిచిన వారందరినీ అనుగ్రహిస్తున్నాడు. తిరుమలలో ఉన్న సమయంలో ఉదయాన్నే లేచి కాలకృత్యాలను తీర్చుకుని సూర్యభగవానునికి నమస్కరించినవారికి ఎటువంటి అనారోగ్యము దరిచేరదు. సర్వ సౌభాగ్యాలూ ఒనగూరుతాయి.

ఈ సృష్టిలో జన్మించిన ప్రతి జీవికి పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు ఉంటాయి. అయితే మానవునికి ఒక్కనికే పదకొండవదైన మనస్సు కూడా ఉన్నది. ఈ మనో ఇంద్రియం వలననే మనో ఇంద్రియ కారణము చేతనే మానవుడు ధర్మా ధర్మ విచక్షణ చేయగలుగుతాడు. విషయమే ఆకారంగా గలది మనస్సు. ఈ మనస్సును నిశ్చలం చేసుకుని ఏకాగ్రతతో శ్రీమన్నారాయణుని ధ్యానించినవారికి ఆత్మ సాక్షాత్కారం కలుగుతుంది.

మనస్సును వశంలో ఉంచుకుంటే రాగద్వేషాలకు, అహంకార మమకారాలకు అతీతంగా ఉండగలుగుతాము. విరాగి, జ్ఞాని అయిన మానవుడు మాత్రమే మనస్సును తన ఆధీనంలో ఉంచుకొనగలుగుతాడు. అప్పుడు అతడు పరబ్రహ్మను సాధించగలుగుతాడు. ఆ బ్రహ్మానందం అనుభవించినవారికి జరా మృత్యువులు ఉండవు. ఆకలి దప్పులు ఉండవు. అతని ఆత్మ పరమాత్మలో విలీనమైపోతుంది. అతడు పూర్తిగా పరబ్రహ్మమూర్తిలో ఐక్యమొందుతాడు.

దేవతలు అశరీరులు. వారికి శరీరం లేదు. అందువలన వారు కర్మలను ఆచరించలేరు. భూలోకంలో జన్మించిన ప్రాణులన్నింటిలో మానవులకు మాత్రమే కర్మ చేసే వీలున్నది. పశుపక్ష్యాదులు, జంతు

జాలము, తమయొక్క పూర్వజన్మకర్మఫలాలన్నీ అనుభవించవలసిందే తప్ప పుణ్య కర్మలను ఆచరించి తమ జీవితం పాపరహితం చేసుకోలేరు. ఇందుకు కారణం వీటికి పదకొండవ ఇంద్రియమైన మనస్సు లేకపోవటమే. మానవుడు ఒక్కడే యుక్తాయుక్త విచక్షణ చేయగలుగుతాడు. తాను పూర్వజన్మలో చేసిన కర్మఫలాలను అనుభవిస్తూ ఈ జన్మలో పుణ్యకార్యాలను ఆచరించి శ్రీమన్నారాయణుని అనుగ్రహం పొందగలిగే అదృష్టం ఒక్క మానవులకే ఉన్నది.

ఈ చరాచర జగత్తంతా శ్రీమన్నారాయణునిచే ఉద్భవించింది. అందువలననే అతడు సర్వభూతాలకు ఈశ్వరుడు. సర్వేశ్వరుడు అనబడుతున్నాడు. భూత, భవిష్యత్, వర్తమాన కాలములన్నీ అతడే. అతడే సత్యము, అతడే నిత్యము, ఆ శ్రీమన్నారాయణుని అర్చించిన వారికి సర్వదేవతలూ నమస్కరిస్తారు. సూర్యుని కుమారుడైన యమధర్మరాజు కూడా అతనికి నమస్కరిస్తాడు.

కాబట్టి మానవులందరూ ఎల్లవేళలా ఆ శ్రీనివాసునే స్మరిస్తూ జీవించాలి. శ్రీనివాసుడు భక్త సులభుడు. అమిత దయగలవాడు. ఇంతటి మహోన్నతమైనటువంటి ఓ శ్రీనివాసా! నీవుండగా మాకు భయమేలనయ్యా! నీకివే మా నమస్కారములు.

ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "*



# చిత్ర

చిత్తా నక్షత్రానికి అధిపతి విశ్వకర్మ. చిత్తా నక్షత్రం రోజున శ్రీనివాసుని స్మరించినా, దర్శించినా యశస్సు, సర్వ సంపదలూ లభిస్తాయి. ప్రత్యేకించి చిత్తా నక్షత్రం ఉన్న సాయంకాల సమయంలో ఏ దేవాలయంలోనైనా శ్రీమన్నారాయణుని దర్శించినవారికి ఫలం అధికంగా ఉండగలదు.

శ్రీనివాసుడు దయా సముద్రుడు, రోజులో ఒక్కసారైనా తనను స్మరించినవారికి సర్వ సౌభాగ్యాలూ అనుగ్రహించే అమృతమూర్తి. తన భక్తులందరినీ ఎల్లవేళలా కాపాడుతూ వారికి కావలసినవన్నీ ముందుగా గ్రహించి అనుగ్రహించే ప్రసన్నమూర్తి శ్రీమన్నారాయణుడే.

పూర్వకాలంలో ఒకనాడు రామనాథుడు, విశ్వనాథుడు అనే ఇద్దరు భక్తులు స్వామి గుణగుణాలను కీర్తిస్తూ తిరుమలకొండ కాలినడకన ఎక్కుతున్నారు. ఆ వేంకటాద్రి రమణీయ ప్రకృతి సంపదకు వారి తనువులు పులకించాయి. దారి పొడవునా వున్న ఆ అద్భుత ప్రకృతి సౌందర్యానికి వారెంతో ఆనందపడ్డారు. ఎటు చూసిన పచ్చదనం, చెట్లపై కోయిలల

పాటలు, చక్కటి సెలయేళ్ళు, అహా ఎంతటి అద్భుతంగా ఉన్నది ఆ దృశ్యం అని తలుస్తూ కొండ ఎక్కుతున్నారు. సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడే శ్రీనివాసునిగా అవతరించిన వేంకటాద్రి అతి పవిత్రమైనది. ఎన్నో జన్మల పుణ్యఫలంచేతగానీ తిరుమల యాత్ర చెయ్యాలని గానీ, కాలినడకన స్వామిని దర్శించాలనే సంకల్పం కలుగదు. సంకల్పించడం గానీ, కొండ నడిచి ఎక్కి స్వామిని దర్శించాలనే తలంపు రాదు.

స్వామివారి దివ్యలీలలను తలుచుకుంటూ కొండ ఎక్కుతున్న రామనాథుడు, విశ్వనాథుడు కొంత సమయానికి చాలా వాలుగా వున్న కొండ ప్రదేశానికి చేరుకున్నారు. చాలా జాగ్రత్తగా అడుగులో అడుగు వేసుకుంటూ ఎక్కుతున్నారు. ఏ మాత్రం అజాగ్రత్తగా వున్నా ప్రక్కన లోతైన లోయలో పడిపోయే ప్రమాదం వుంది. అలా భయం భయంగా ఎక్కుతుండగా ఒక్కసారిగా రామనాథుడు కాలువేసిన రాయి కొద్దిగా జారి పట్టు తప్పాడు. అంతా ఒక్కసారి జారి కింద పడ్డాడు. ఆ పడటంలో విశ్వనాథుడిపై తూలి పడటంతో అతడు కూడా కిందపడటం జరిగింది. ఇలా ఇద్దరు మిత్రులు ఒక్కసారిగా కనులు మూసి తెరిచేటంతలో పట్టు తప్పి లోయలోనికి పడ్డారు. అక్కడ లోయ దాదాపు నలభై అడుగుల లోతు ఉంది. అంత ఎత్తు నుంచి పడినప్పటికి విశ్వనాథుడి శరీరం చెక్కు చెదరలేదు. చిన్నగాయం కూడా కాలేదు. రామనాథునికి మాత్రం బాగా దెబ్బలు తగిలాయి. కాలు విరగిందేమోననిపించింది. ఏమిటీ విచిత్రం! తనకి ఇన్ని దెబ్బలు తగిలి, విశ్వనాథుడికి చిన్న గాయం కూడా కాకపోవడమేమిటి? అని తలచి ఇదే ప్రశ్న మిత్రుడ్నీ అడిగాడు.

అప్పుడు విశ్వనాథుడు! అంతా శ్రీనివాసుని మహిమ తప్ప మరొకటి కాదు!... నేను కాలు జారి లోయలో పడిపోతున్న తక్షణం స్వామీ! అంతా నీదే భారం! నీవు తప్పక రక్షిస్తావు! అని మనస్సులో ప్రార్థించాను, అంతకు మించి మరేమీ లేదు అని చెప్పాడు. అప్పుడు రామనాథునికి అర్థమయింది. తాను కూడా స్వామిని ప్రార్థించాడు. కానీ తాను ఏమని ప్రార్థించాడు? ఓ స్వామీ నీవు నిజంగా ఉన్నట్లైతే నాకు ఏ ఆపదా రాదు. ఏ చిన్న దెబ్బ కూడా తగలకూడదు. అనుకున్నాడు. తన ప్రార్థనలో సంశయమున్నది. స్వామి ఉన్నాడో, లేడోననే అనుమానమున్నది. ఆ స్వామినే పరీక్షించాను నేను, ఎంత తప్పు చేశాను? నువ్వు ఉన్నట్లయితే నన్ను రక్షిస్తావు అనుకున్నాను. కానీ విశ్వనాథుడు మాత్రం నువ్వు వున్నావు, నువ్వు తప్పక రక్షిస్తావు అనుకున్నాడు, అంత నమ్మకం ఉన్నది కాబట్టే అతడు పూర్తిగా రక్షింపబడ్డాడని రామనాథుడు గ్రహించాడు.



శ్రీనివాసుని సంపూర్ణ శరణాగతి వేడినవారికి ఏ ఆపదలూ దరి చేరవు. ఎటువంటి సంశయాలకూ తావివ్వకుండా సంపూర్ణ భారం తనమీదే వేసే భక్తుల యోగక్షేమాలు పూర్తిగా తానే వహిస్తాడు శ్రీనివాసుడు. శ్రీమన్నారాయణునికి కావలసింది నిష్కళంక, నిర్మల ప్రేమ. లేశమైన అనుమానం లేకుండా ఆ స్వామిని ప్రార్థిస్తే చాలు, అన్నీ తానే చూసుకుంటాడు.

ఓ శ్రీనివాసా! ఎంతటి అమృతమూర్తివి తండ్రీ నీవు. సకల చరాచర సృష్టి కర్తవు నీవే, సర్వ మంగళ స్వరూపుడవు నీవే. నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "*

# స్వాతి

నక్షత్ర సమూహంలో పదిహేనవదైన స్వాతి నక్షత్రానికి అధిపతి వాయుదేవుడు. వాయుదేవుని అంశతో జన్మించిన హనుమంతుడు శ్రీరామభక్తుడు. ఎల్లవేళలా ఆ రామనామమే తప్ప మరొక ధ్యాస ఎరుగని వాడు. ఏ భక్తునికైనా అదే ఆదర్శం.

శ్రీమన్నారాయణుడు రామావతారంలో వెలసి రావణ సంహారం చేసి, లోకోద్ధరణ గావించాడు. రావణ వధకు ముందు ఎంతోమంది రాక్షసులను సంహరించి, మునులను, సామాన్య ప్రజలను రక్షించాడు. లోక కళ్యాణార్థమై శ్రీమన్నారాయణుడు ఆవిర్భవించిన అవతారాలలో శ్రీరామావతారం ఎంతో ప్రముఖమైనది. ఎవరైతే ఎల్లవేళలా రామనామాన్ని జపిస్తారో వారికి ఎటువంటి ఆపదలూ కలుగవు. సర్వ సౌభాగ్యాలూ లభిస్తాయి. అపమృత్యు భయం వుండదు. సంపూర్ణ ఆయుష్షుతో కలకాలం సుఖంగా జీవించి చివరన ముక్తిని పొందుతారు.



ఒకసారి నారదుడు లోక సంచారం చేస్తూ ఇంద్రలోకం ప్రవేశించాడు. ఇంద్రుడు నారదుని రాకకు ఎంతో సంతోషించి, ఆ మహర్షికి అనేక సపర్యలు గావించి ఈ విధంగా అన్నాడు. ఓ నారద మునీంద్రా నీ రాకను మాకెంతో సంతోషకరం. నీకివే మా నమస్కారములు. సర్వకాల సర్వావస్థలయందు ఆ శ్రీమన్నారాయణుని నామమే జపించే నీ దర్శనం సర్వమంగళకరం. ఆ జగన్నాథునిమీదే ధ్యాస నిలుపుకునే మీవంటి మహనీయుల రాక మాకెంతో సంతోషం. దయచేసి నాకొక విషయం వివరంగా చెప్పవలసింది. శ్రీమన్నారాయణుని నామ మహిమ ఎంతో ఉన్నతమైనది కదా. ఆ నామ మహిమ మీ నుంచి మరింత వివరంగా వినాలని ఉంది. ఇంతకుముందు నేను ఎందరో మునీశ్వరులను, మహా పురుషులను నారాయణ మహిమ గురించి అడుగగా వారెంతో చక్కగా, ఎన్నో విధాల వివరించారు. కానీ నాకు ఇంకా ఇంకా ఆ స్వామి గురించి వినాలని ఉన్నది. అందుకే మిమ్ములను అడుగుతున్నాను. ఎల్లవేళలా ఆ స్వామి నామమే జపించే మీకంటే ఆ స్వామి తత్త్వాన్ని అద్భుతంగా ఇంకెవరు వివరించగలరు. కావున నాయందు దయవుంచి నారాయణ నామ వైభవం వివరించవలసినది అని అర్థించాడు.

ఆ మాటలకు నారదుడు ఎంతో సంతోషపడి 'ఓ ఇంద్రా! నీవడిగిన విషయం నాకెంతో ఆనందకరమైనది. కానీ ఆదిమధ్యాంతరహితుడైన ఆ స్వామి గురించి పూర్తిగా వివరించటం వేయి నాలుకలున్న ఆ ఆదిశేషునికి కూడా సాధ్యం కాదు. అటువంటిది నేనెంతటివాడిని? సర్వ వేద సారమూ, సర్వ శాస్త్ర విజ్ఞానమూ తెలిసినా కూడా ఆ స్వామి నామ మహిమను సహస్ర వంతు కూడా వర్ణించటం సాధ్యం కాదు. ఎంతోమంది మునీశ్వరులు శ్రీమన్నారాయణుని నామ మహిమను కనీసం లక్షోవంతు తెలుసుకోవడానికి వేలకొలది సంవత్సరాలుగా తపస్సు చేస్తున్నారు. అంతటి

మహోన్నత పరబ్రహ్మమూర్తిని గురించి నాకు తెలిసినంతలో వివరిస్తాను. నేను చెప్పే ప్రతీ మాట కూడా ఆ స్వామి అనుగ్రహమే అని నువ్వు గ్రహించవలసింది. ఆ శ్రీమన్నారాయణుని అనుగ్రహం లేకపోతే ఆ స్వామి గురించి ఒక్క అక్షరం కూడా మనం మాట్లాడలేము. ఆ స్వామి లీలలను, దివ్య మాహాత్మ్యములను ఒక గంట తలచుకోవడానికి కూడా వేయి జన్మల పుణ్యఫలం కావాలి. శ్రీమన్నారాయణుడు ఈ సృష్టి మొత్తానికి ఆధారభూతుడు. సర్వ ప్రాణ కోటిలోనూ అంతరాత్మ రూపంలో ఉన్న పరబ్రహ్మమూర్తి అతడే. అతని అనుగ్రహం వలననే మీ దేవతలందరికీ మీమీ శక్తులు లభిస్తున్నాయి. ఆ పరమేశ్వర స్వరూపుడైన శ్రీమన్నారాయణుడు లేని ప్రదేశం లేదు. ఇక్కడ ఉన్నాడు. అక్కడ లేడు అనే మాట లేదు. ఒకే కాలంలో సృష్టిలోని అణువణువందూ ఉన్నది ఆ శ్రీమన్నారాయణుడే. సృష్టికి పూర్వమూ ఉన్నాడు. ఇప్పుడు ఉన్నాడు. సృష్టి మొత్తం లయం అయిన తర్వాత కూడా ఉంటాడు. ప్రళయకాలంలో ఈ సమస్త సృష్టిని తనలో లయం చేసుకుంటాడు. శ్రీమన్నారాయణుడు భక్త సులభుడు. ఏ భక్తుడైనా కేవలం ఒక్కసారైనా ఆర్తితో పిలిస్తే తక్షణం వాని ఎదురుగా ప్రత్యక్షమై వారికోరికలు తక్షణం తీరుస్తాడు. తననే నమ్మిన భక్తులకోర్కెలు సత్వరం తీర్చడం ఆ స్వామికి మహదానందకరం. తను అనుగ్రహించిన కోర్కెలు తీరగానే తన భక్తులు పడే ఆనందం చూసి ముచ్చట పడతాడు. అంతటి అమృతమూర్తి ఆ శ్రీమన్నారాయణుడు.

ఈ సృష్టిలోని ప్రతీ జీవిలోనూ ఆ స్వామి చైతన్యమూర్తిగా హృదయాంతరాళాలలో ప్రకాశిస్తున్నాడు. నోటికి మాట్లాడగలిగే శక్తి చెవికి వినే శక్తి, కనులకు చూసే శక్తి, ఈ శక్తులన్నింటికీ మూలం ఆ దివ్య పరబ్రహ్మమూర్తియే. ఏ కార్యమైన ఆ స్వామిని ఒక్కసారి మనస్సులో తలచుకుని మొదలు పెడితే పూర్తిగా విజయవంతమవుతుంది. ఎంతటి



కష్టతరమైనదైనా ఆ స్వామి ఒక్కసారి మనస్సులో తలచుకుంటే దూది పింజలకంటే తేలికగా సాధ్యమవుతుంది. జయప్రదంగా నెరవేరుతుంది. ఓ మహేంద్రా! ఇంతెందుకు? ఆ స్వామిని ఒక్కసారి స్మరిస్తే ఈ సృష్టిలో సాధ్యపడనిది ఏదీ లేదు! అని వివరించాడు నారదుడు.

ఇదంతా విన్న ఇంద్రుని ఆనందానికి అంతు లేదు. ఆనంద బాష్పాలతో నారదునితో ఇంద్రుడు ఈవిధంగా అన్నాడు. 'ఓ నారద మునీంద్రా! ఈ రోజు నా జీవితంలో మరిచిపోలేనిది. శ్రీనారాయణతత్త్వాన్ని ఎంతచక్కగా విశదీకరించావు స్వామి! నీకు మా నమస్కారములు అని నారదుని ఎన్నో విధాల సత్కరించి పంపాడు.

తిరుమలలో శ్రీనివాసునిగా వెలసిన శ్రీమన్నారాయణుడు దివ్య మంగళమూర్తి. తనను నమ్మిన భక్తులవెంటే ఎల్లవేళలా తోడుండే మహోన్నత మూర్తి ఆ శ్రీ వేంకటేశ్వరుడు.

ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "*

# విశాఖ

విశాఖ నక్షత్రానికి అధిపతులు ఇంద్రాగ్నులు. విశాఖ అయిదు నక్షత్రాల సమూహం. ఇక్కడినుంచీ జ్యోతిశ్చక్రం మరో శాఖలోనికి వెళుతుంది. అందుకే ఇది వి-శాఖ, విశాఖ నక్షత్రంగా పిలవబడుతున్నది. ఈ నక్షత్రాన్ని రాధా నక్షత్రమని కూడా అంటారు. ఇందువలననే వైశాఖ మాసాన్ని రాధామాసం అని కూడా వ్యవహరిస్తారు.

వైశాఖ మాసం శ్రీనివాసునికి ఎంతో ప్రీతిపాత్రమైనది. ఈ మాసంలో ఎవరైతే ఓం నమో నారాయణాయ అనే అష్టాక్షరీ మంత్రాన్ని జపిస్తూ ఉంటారో వారి సర్వభాగ్యాలూ కలుగుతాయి. జీవించినంత కాలం సుఖంగా జీవించి చివరకు అమృతతత్త్వాన్ని పొందుతారు. ఈ అష్టాక్షరీ మంత్రానికి మించిన దివ్య ఔషధం మరొకటి లేదు. మంత్రము అంటే మననం చేయువారిని రక్షించునది అని అర్థం. ఎవరైతే ఓం నమో నారాయణాయ అనే మంత్రాన్ని రోజులో ఒక్కసారైనా జపిస్తున్నారో వారు అన్ని ఆపదల నుండి రక్షింపబడుతారు. అకాల మృత్యువు దరిచేరదు. పూర్ణాయుష్షుతో కలకాలం సుఖంగా జీవిస్తారు.



అద్భుతమైన ఈ అష్టాక్షరీ మంత్రం సృష్టిలో తిరుగులేని శక్తి కలది. ఈ మంత్రంలో ఓం అనేది ఆత్మ స్వరూపం. నమః అనేది ప్రకృతి స్వరూపం. అకార, ఉకార, మకార కలయికే ప్రణవ స్వరూపమైన ఓంకారము. ఈ సృష్టి మొత్తం ఓంకారంనుంచే ఉద్భవించింది. అదే నారాయణ స్వరూపం. శ్రీమన్నారాయణుడు సృష్టి చేయాలి అనే సంకల్పించగానే అతని మహోజ్వల స్వరూపం నుంచి హిరణ్యగర్భుడు ఆవిర్భవించాడు. ఆ తర్వాత పంచభూతాలు ఉద్భవించాయి. ఆ తరువాత శ్రీమన్నారాయణుడు మరొక్కమారు సంకల్పం చేయగా ఆ పరబ్రహ్మమూర్తినుండే బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు, ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, సకల వేదాలూ ఉద్భవించాయి.

ఓంకార స్వరూపుడైన శ్రీమన్నారాయణుడు సత్యము, నిత్యము. భూమి, ఆకాశము, దశ దిశలూ వ్యాపించి ఉన్నది ఆ శ్రీమన్నారాయణుడే. ఊర్ధ్వ, మధ్య, అధోభాగములయందు ఉన్నది ఆ శ్రీనివాసుడే. అతడు కాలపురుషుడు. భూత, భవిష్యత్ వర్తమాన కాలాలు అతడే. ఈ సృష్టిమొత్తం శ్రీమన్నారాయణుని స్వరూపమే. ఈ విషయం గ్రహించిన వారు కూడా నారాయణ స్వరూపులే అవుతారు.

సర్వాంతర్యామి అయిన శ్రీమన్నారాయణుడు జీవుల హృదయ పద్మంలో ప్రకాశిస్తూ ఉంటాడు. సర్వ జీవకోటియందు అంతర్యామి స్వరూపంగా భాసిస్తున్నది అతడే. అష్టాక్షరీ మంత్రమైన ఓం నమో నారాయణాయ లోని ఓంకారము బ్రహ్మ స్వరూపము. నకారము విష్ణు స్వరూపము, మకారము రుద్ర స్వరూపము. నకారము ఈశ్వరరూపము. రకారము విరాట్ స్వరూపము. యకారము పరమ పురుష స్వరూపము. ణకారము భగవత్స్వరూపము, ఇక చివరిదైన యకారము పరమాత్మ

స్వరూపము. ఇంతటి మహోన్నతమైన నారాయణ అష్టాక్షరీ మంత్రాన్ని జపించినవారికి సర్వ భాగ్యాలూ సమకూరుతాయి.

మానవులందరూ అనేక కర్మలు చేస్తుంటారు. మనం చేసే మంచి కర్మలవలన పుణ్యమూ, చెడు కర్మలవలన పాపమూ కలుగుతుంది. మానవులు చేసే కర్మ రెండు రకాలుగా ఉంటుంది. ఒకటి సంచిత కర్మ. రెండవది వర్తమాన కర్మ. సంచిత కర్మ అంటే మనం జన్మ జన్మలనుంచి మోసుకుని వచ్చినది. ఇది ప్రతి జన్మలోనూ ఎంతోకొంత అనుభవిస్తుంటాము. ఈ కర్మను పూర్తిగా క్షయం చేయాలంటే ఆ కర్మను పూర్తిగా అనుభవించటమే. అనుభవించటం వలన మాత్రమే కర్మ క్షయం అవుతుంది. కానీ మానవుడు కోటానుకోట్ల జన్మలలో మూటకట్టుకున్న కర్మను క్షయం చేసుకోవాలంటే ఈ కల్పాంతం దాకా జన్మలెత్తినా సాధ్యపడదు. కాబట్టి ఈ సంచిత కర్మను జ్ఞానాగ్నిలో దగ్ధం చేయాలి. ఈ విధంగా మాత్రమే సంచితకర్మ క్షయమవుతుంది.

ఇకపోతే రెండవది వర్తమానంలోని కర్మ. అంటే ఈ జన్మలో చేసిన కర్మవల్లనే క్షయమయ్యేది. ఇది లాగి వదిలిన బాణం వంటిది. ఈ జన్మలో చేసిన మంచి చెడులకు కొంతమేర ఈ జన్మలో అనుభవించవలసి రావడం. ఎటువంటి కర్మనైనా క్షయం చేసుకునే జ్ఞానాన్ని, దివ్యత్మాన్ని ప్రసాదించగలిగేది ఒక్క నారాయణ అష్టాక్షరీ మంత్రం ఒక్కటే. ఇది మోక్షప్రాప్తికి అతి తేలికైన సాధనం.

శ్రీమన్నారాయణుడు ఆశ్రిత వత్సలుడు. అల్ప సంతోషి కూడాను. కేవలం గుప్పెడు అటుకులు మాత్రమే ఇచ్చిన సుదామునికి సర్వ సంపదలూ అనుగ్రహించాడు. శ్రీమన్నారాయణ తత్త్వాన్ని అర్థం చేసుకుని అతడే పరమాత్ముడు, పరమ గురువు, పరమ గతి, పరమాశ్రయుడు,



పరమ సఖుడు, అని తెలుసుకున్నవారికి సర్వ భాగ్యాలూ లభిస్తాయి. ఇంతటి అమృతమూర్తి అయిన శ్రీమన్నారాయణుడే తిరుమలలో శ్రీనివాసునిగా వెలసి తనను శరణు వేడిన భక్తులను ఎల్లవేళలా రక్షిస్తున్నాడు. సర్వ సంపదలూ అనుగ్రహిస్తున్నాడు.

ఓ శ్రీనివాసా! ఎంతటి అమృతమూర్తివి తండ్రీ నీవు. సకల చరాచర సృష్టి కర్తవు నీవే, సర్వ మంగళ స్వరూపడవు నీవే. నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "*

# అనూరాధ

అనూరాధ నక్షత్రానికి అధిపతి సూర్యుడు. రాధా నక్షత్రమైన విశాఖ తర్వాత వచ్చే నక్షత్రం కాబట్టి అనూరాధ నక్షత్రంగా పిలవబడుతున్నది. అనూరాధ నక్షత్రం నాడు శ్రీనివాసుని స్మరించిన వారికి సర్వసౌభాగ్యాలూ సిద్ధిస్తాయి.

శంఖుచక్రగధాధరుడైన ఆ శ్రీమన్నారాయణుని స్మరించినవారికి సర్వసంపదలూ లభిస్తాయి. ఈ సృష్టి సర్వమూ అతనియందే జన్మించి, అతనియందే స్థితులను అనుభవించి, చివరిని అతని యందే లయమగుచున్నది. సమస్త ప్రాణికోటికీ ఆధారము ఆ పరమాత్మస్వరూపమే. సముద్రాలు, పర్వతాలూ, నదులు, ధర్మము, యజ్ఞయాగాదులు, వేదాంగాలు, సర్వశాస్త్రాలూ, త్రికాలములూ, త్రిలోకములూ, అన్నీ ఆ స్వామిని ఆశ్రయించే ఉన్నాయి.

గో అంటే భూమి అని అర్థము. ఈ భూమి సముద్ర జలంలో మునిగిపోయినప్పుడు వరాహ అవతారమెత్తి భూమిని తన కోరలపై



ఉంచుకుని పైకి తీసుకొచ్చినవాడు కాబట్టి శ్రీమన్నారాయాణుడు గోవిందునిగా పిలవబడుతున్నాడు. గో అంటే వాక్కు అనే అర్థం కూడా ఉంది. వాక్కు అంటే వేదముల ద్వారా తెలుసుకొనగలిగినవాడు కాబట్టే గోవిందుడు అనబడుతున్నాడు.

సమస్త దేవతాగణమూ అద్వితీయుడు, ఆదిమధ్యాంతరహితుడు. నిరంతర సర్వ వ్యాపకుడు, సచ్చిదానంద స్వరూపుడు అయిన ఆ శ్రీమన్నారాయాణమూర్తినే ఎల్లవేళలా అర్చిస్తున్నారు.

వేదంలో ఒకచోట శ్రీమన్నారాయణునికి మూడు ముఖ్యలక్ష ణాలున్నట్లుగా చెప్పబడింది. మొదట, శ్రీమన్నారాయణుడు మూడు అంశాలు కలవాడు. రెండవది బృహత్ శరీరం కలవాడు. మూడవ లక్షణం ఎల్లప్పుడు నవ యవ్వన రూపంలో ఉండే లక్షణం. శ్రీమన్నారాయణుని మూడు అంశాలూ సూర్య గమనాన్ని సూచిస్తున్నాయి. ఈ మూడు అంశాలే త్రిసంధ్యలు.

ఈ సృష్టి ప్రారంభంలో పరమేశ్వరుడు నిరాకార స్వరూపుడు. ఏ ఆకారము, ఏ గుణములూ లేనివాడు, తనకు సమానమైనవారుగానీ, తనతో ఆధారమైనవాడు గానీ లేకుండా ఏకాకిగా ఉన్నాడు. అప్పుడా పరబ్రహ్మమూర్తికి సంకల్పం చేయగానే ఈ సృష్టిలోని అనేక రూపాలతో ఆవిర్భంచాయి. ఘన, ద్రవ, వాయు పదార్థాలుగా ఎన్నో రూపాలు పొందింది. అనేక ఆది దేవతలూ, పంచభూతాలూ, నవగ్రహదేవతలూ, సర్వప్రాణికోటి ఉద్భవించింది. ఆ పరమాత్మస్వరూపమే సర్వప్రాణికోటి హృదయాలలో హంసరూపంలో సంచరిస్తున్నది. ఈ హంసకు అగ్ని, చంద్రమండలాలే రెక్కలు, ఓంకారమే శిరస్సు. జ్ఞాననేత్రమే ముఖము. హకార సకారములే పాదాలు. ఈ సమస్త ప్రాణికోటి హృదయాలలోను అంతర్యామి

స్వరూపంలో ఉన్న పరబ్రహ్మమూర్తి శ్రీమన్నారాయణుడే. ఈ విషయాన్ని గ్రహించిన వారు కూడా శ్రీమన్నారాయణమూర్తి అవగలుగుతాడు.

ఆత్మకు పాపం అంటదు. ఎటువంటి ఆకలి దప్పులూ ఉండవు. శరీరం అశాశ్వతమైనది. ఆత్మయొక్కటే శాశ్వతం. శాశ్వతమైన ఆత్మకు అశాశ్వతమైన శరీరం ఆవాసంగా ఉంటుంది.

పరబ్రహ్మస్వరూపమైన శ్రీమన్నారాయణుడు ఈ సృష్టి అంతా వ్యాపించి ఉన్నాడు. ఆ స్వామి విశ్వరూపంలో ఈ జగత్తంతా ఉన్నాడు. అందుకే మనం ఎక్కడి నుంచి నమస్కరించినా ఆ స్వామికే చెందుతుంది. ఈ సృష్టిలో ఏ ప్రదేశం నుండి స్వామికి పూలు సమర్పించినా ఆ స్వామికే చెందుతాయి. ఏ ప్రాంతంలో నుంచుని పాదాలకు ఊహించుకుని నమస్కరించినా ఆ పరబ్రహ్మమూర్తి పాదాలకు నమస్కరించినట్లే. అటువంటి ఆ స్వామి పాదాలు ఈ విశ్వం అంతా ఆవరించి ఉన్నాయి. భక్తుడు ఎక్కడ ప్రసాదం సమర్పించినా ఆ స్వామి అక్కడే సంతోషంగా స్వీకరిస్తాడు. ఆ స్వామి కన్నులు కూడా ఈ విశ్వం మొత్తం ఆవరించడం వలన ఈ సృష్టిలోని ప్రతీ విషయం స్వామికి కనిపిస్తూనే ఉంటుంది. కాలచక్రము, జగత్ చక్రము, యుగచక్రము వీటన్నింటినీ శ్రీమన్నారాయణుడు ఎల్లప్పుడూ త్రిప్పుతూనే ఉంటాడు.

భూత, భవిష్యత్, వర్తమాన కాలాలు ఆ మూర్తి స్వరూపాలే కాబట్టి ఈ సృష్టిలో ఏ కాలంలో ఏది జరిగినా ఆ విషయం స్వామికి కనిపిస్తూనే ఉంటుంది. సృష్టి అంతా వ్యాపించి ఉన్నాడు కాబట్టి ఆ స్వామి ఈ విశ్వంలోని తన భక్తులందరి పూజలూ ఒక కాలంలో స్వీకరించగలడు. భక్తులందరి కోరికలు ఒకే కాలంలో వినగలడు. ఎవరే వరం కోరినా వారందరికీ ఒకే కాలంలో అనుగ్రహించగలడు కూడా.



అంతటి అమృతమూర్తి శ్రీమన్నారాయణుడే. శ్రీనివాసునిగా వెలసిన తిరుమల ఈ భూలోకంలో దివ్యధామము. తనకు నమ్మినవారికి బాధ్యత పూర్తిగా వహించే అమృతమూర్తి శ్రీనివాసుడు. ఎన్నో జన్మల పుణ్యఫలం చేతగానీ తిరుమల యాత్ర చేసి శ్రీనివాసుని దివ్యదర్శనం చెయ్యాలనే తలంపు కలుగదు. నమ్మినవారికి కొంగు బంగారమై, సర్వకాల సర్వావస్థలయందు తననే స్మరించేవారికి అన్ని భోగ భాగ్యాలూ అనుగ్రహిస్తున్న ఆ దేవదేవునికి ఇవే మా నమస్కారములు.

ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "*

# జ్యేష్ఠ

జ్యేష్ఠ నక్షత్రానికి అధిపతి ఇంద్రుడు. జ్యేష్ఠ సూర్యుని కంటే తొమ్మిది కోట్ల రెట్లు పెద్దది. ఇది నక్షత్ర సమూహంలో పద్దెనిమదవ నక్షత్రం. ఈ నక్షత్రం నాడు శ్రీమన్నారాయణుని అర్చించినవారికి విశేషమైన ఉన్నతమైన పదవులు లభిస్తాయి. సర్వ సంపదలూ చేకురుతాయి.

జ్యేష్ఠ నక్షత్రం నాడు శ్రీనివాసుని దర్శనం ఎంతో శుభప్రదము. మోక్షమే కోరే వారికి మోక్షం లభిస్తుంది. భోగభాగ్యాలు కోరేవారికి మరిన్ని సంపదలు లభిస్తాయి. జ్ఞానం ఆశించే వారికి జ్ఞానం లభిస్తుంది. పుణ్యం కోరేవారికి పాపక్షయం కలిగి పుణ్యం లభిస్తుంది.

పూర్వకాలంలో 'హు హు' అనే గంధర్వుడు ఉండేవాడు' ఒకనాడు ఆ గంధర్వుడు తన భార్యలతో కలిసి విహరిస్తూ ఒక సరోవర తీరానికి చేరుకున్నాడు. ఆ ప్రకృతి సంపద, అద్భుతమైన సెలయేరు చూడగానే ఆ గంధర్వునికి తన భార్యలతో జలక్రీడలు ఆడాలనే తలంపు కలిగింది. మనస్సులో ఆ కోరిక రాగానే తన భార్యలతో కలిసి ఆ సరోవరంలో దిగి



స్నానం చేస్తూ ఒళ్లు మైమరిచిపోయాడు. కాసేపటికి ఆగంధర్వునికి ఆ సరస్సులో ఒక ప్రక్కగా నీటిలో నుంచుని సూర్యునికి అర్ఘ్యం వదులుతున్న మునీశ్వరుడు కనపడ్డాడు. పూర్తిగా మత్తులో ఉన్న గంధర్వుడు విచక్షణా జ్ఞానం లోపించినవాడై ఆ నీటిలో మునిగి ఈదుతూ వెళ్ళి ఆ మునీశ్వరుని కాళ్లు పట్టుకుని లాగాడు.

గంధర్వుడి దుశ్చర్యకు మునికి ఎంతో కోపం వచ్చింది. వెంటనే గంధర్వునితో 'ఓయీ! మూర్ఖుడా! ఒళ్ళు తెలియని అహంకారంతో మొసలి లాగా వచ్చి నా కాళ్ళు లాగి వేసావు కాబట్టి మరు జన్మలో నీవు మొసలివై జన్మించవలసింది. అని శాపం ఇచ్చాడు. అప్పుడు గంధర్వుడు తన తప్పు తెలుసుకుని ఆ మునీశ్వరుని క్షమించమని ఎన్నో విధాల బ్రతిమాలాడు. అప్పుడా మునీశ్వరుడు కోపం తగ్గినవాడై 'నువ్వు మొసలిగా జన్మించి ఈ సరస్సులో ఉండగా గజరాజు ఒకడు తన భార్యాలతో విహరిస్తూ ఈ సరోవరంలో జలకాలాడడానికి వస్తాడు. అప్పుడు నువ్వు అతని కాళ్ళు పట్టుకో. అప్పుడు ఆ గజరాజు మొరనాలకించి శ్రీమన్నారాయణుడు వచ్చి తన సుదర్శన చక్రంతో నిన్ను సంహకరిస్తాడు. అప్పుడు నీకు శాపవిమోచనం అవుతుంది. అని అన్నాడు. అది విని గంధర్వుడు ఆ మునీశ్వరునికి నమస్కరించి తిరిగి తన లోకానికి వెళ్లిపోయాడు.

ద్రవిడదేశాన్ని ఇంద్రద్యుమ్నుడు అనే రాజు పరిపాలిస్తుండేవాడు. ఎంతో ధర్మపరంగా రాజ్యాన్ని పాలించి, చివన తన కుమారునికి పట్టం కట్టి మలయాచలంపై నివాసం ఏర్పాటు చేసుకున్నాడు. రాజు ధ్యానం చేస్తూ గడపసాగాడు. ఇలా కొన్ని రోజులు గడవగా ఒకరోజు అగస్త్యముని తన శిష్యులతో కలిసి అటుగా రావడం సంభవించింది. ధ్యానంలో ఉన్న రాజు ఆ మునీశ్వరుని రాకను గమనించలేదు. అందుకు అగస్త్యుడు కోపించి వచ్చే జన్మలో ఏనుగుగా జన్మించవలసిందిగా శపించాడు.

కొంతకాలానికి గంధర్వుడు మొసలిగా జన్మించి ఆ సరోవరంలో నివసింపసాగాడు. ఇంద్రద్యుమ్నుడు గజరాజుగా జన్మించి అడవిలో పడి విహరిస్తూ ఉండేవాడు. పూర్వజన్మలోని రాజు లక్షణాలు తొలగిపోక ఎంతో అహంకారంతో ఉండేవాడు. ఒక రోజు ఆ గజరాజు తన ఆరుగురి భార్యలతో కలిసి సరోవరం లోకి జలక్రీడలకోసం దిగాడు. ఒళ్ళు తెలియని మదంతో, సరస్సు మొత్తం విహరిస్తూ సరస్సులోని తామరలను, ఎంతో చక్కటి పూల ముక్కలను చిన్నాభిన్నం చెయ్యసాగాడు. నీటిని తొండంతో అటూ ఇటూ చల్లుతూ, భీకరంగా ఘీంకరిస్తూ సరస్సు మొత్తాన్ని పాడు చెయ్యసాగాడు. అప్పుడు మొసలి రూపంలో ఉన్న గంధర్వుడు వచ్చి గజరాజు కాలు పట్టుకున్నాడు. గజరాజు తీవ్రమైన కోపంతో ఒక్కసారి కాలు విదిలించాడు. కానీ లాభం లేకపోయింది. ఇంకా తీవ్రంగా, మరింత బలాన్ని ఉపయోగించి విదిలించాడు. కానీ మొసలి తన పట్టు ఏ మాత్రం సడలించలేదు. గజరాజు భార్యలన్నీ విలపిస్తున్నాయి. కానీ తన పట్టును మొసలి ఏ మాత్రం వదలలేదు. ఇలా కొన్ని వేల సంవత్సరాలు గడిచింది.

గజరాజు సత్తువ నశించసాగింది. ఇంక ఆ పరమాత్ముడు తప్ప తనను రక్షించే నాథుడు లేడని గ్రహించాడు. ఆ శ్రీమన్నారాయణుడే తప్ప నాకు వేరే దిక్కు లేదని అనేక విధాల మొర పెట్టుకున్నాడు. ఆర్తజన రక్షకుడైన శ్రీమన్నారాయణుడు తక్షణమే వచ్చి మొసలి తలను తన చక్రాయుధంతో నరికి గజరాజుని రక్షించాడు. గజరాజుకు గల ఆ ఆరుభార్యలే అరిషడ్వర్గాలు. వీటిని జయించలేని వారిని మొసలిలాగా సంచిత కర్మ పట్టుకుంటుంది. అటువంటి సమయంలో ఆ పరబ్రహ్మమూర్తిని శరణువేడటం తప్ప మరొక గతి లేదు. తానే శరణాగతి అన్న వారిని తక్షణం రక్షించే అమృతమూర్తి శ్రీమన్నారాయణుడు.



తన భక్తుడు ఈ విశ్వంలో ఎక్కడ ఉన్నాసరే, తనను మనస్ఫూర్తిగా వేడుకుంటే తక్షణం రక్షిస్తాడు. ఆ భక్తుడు ఇటువంటివాడు, అటువంటివాడని ఆలోచించాడు. అతడు ధనికుడా, బీదవాడు అని శంకించడు. నన్ను ఇప్పటివరకూ జన్మలో ఒక్కసారైనా స్మరించలేదే అని తలచడు. ఇంతకు ముందు ఎన్నడూ తనకు యజ్ఞయాగాదులూ చెయ్యలేదే అని ఆలోచించడు.

జీవితంలో ఎన్నడూ దేవాలయానికి వెళ్ళనివాడైనా సరే, ఏ నిత్య పూజలు చెయ్యనివాడైనా సరే కష్టంలో ఉన్నప్పుడు ఒక్కసారి తనను స్మరిస్తే చాలు, తనను ఆర్తిగా పిలిస్తే చాలు. తాను తప్ప ఇహపరంబెరుగనని ప్రార్థిస్తే చాలు. తక్షణం వచ్చి ఆ భక్తుణ్ణి ఆదుకునే అమృతమూర్తి శ్రీమన్నారాయణుడు. అంతటి ఆ పరబ్రహ్మమూర్తి తిరుమలలో శ్రీనివాసునిగా వెలసి తనను నమ్మిన భక్తులకు సర్వ భాగ్యాలూ అనుగ్రహిస్తున్నాడు.

ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "*

# మూల

మూల నక్షత్రానికి అధిపతి నిరృతి. సరస్వతీదేవి నక్షత్రమైన మూల నక్షత్రంనాడు శ్రీమన్నారాయణుని దర్శించినవారికి సర్వ జ్ఞానములూ, సర్వ సౌభాగ్యాలూ లభిస్తాయి.

పూర్వకాలంలో అవంతీనగరంలో విష్ణుశర్మ అనే మహా పండితుడు నివసించేవాడు. అతనికి పూర్వజన్మ సుకృతం వలన చిన్నతనంలోనే అన్ని విద్యలూ అబ్బటం జరిగింది. ఎల్లప్పుడు వేద పారాయణం చేస్తూ ఉండేవాడు. ఆ దేశంలోని వేదపాఠశాలకు ముఖ్య సలహాదారుగా ఉండటమే కాకుండా రాజుకు జ్యోతిష, ముహూర్త విషయాలలో సలహాలిస్తూ ఉండేవాడు. రోజు త్రికాల సంధ్య చేసేవాడు. పర్వ దినాలల్లో యజ్ఞ, యాగాదులు నిర్వహిస్తూ ఉండేవాడు. ప్రతీరోజు విష్ణు సహస్రనామాలు తప్పక పారాయణం చేస్తుండేవాడు. ఆ దేశంలోని వారందరూ విష్ణుశర్మ ఎప్పుడు ఎదురుపడినా నమస్కరించేవాళ్ళు. దేశంలో సాహితీపరమైన ఏ సభా సమావేశాలు జరిగినా విష్ణుశర్మ తప్పక ముఖ్య అతిథిగా ఉండాల్సిందే. అంత గొప్ప పేరును, ప్రాచుర్యాన్ని సంపాదించాడు విష్ణుశర్మ.



ఇంతటి జ్ఞానము, పాండిత్యము ఉన్న విష్ణుశర్మకి రోజురోజుకి అహంకారము రాసాగింది. ఈ సభలు, సమావేశాలు అందరూ తనను పొగడడము, తన వాగ్ధాటి, తన పాండిత్యం ముందు ఏ పండితుడూ నిలువలేకపోవడము చూసి విష్ణుశర్మకి అహంకారం పెరిగింది. ఎంతటి వారికైనా ఈ అహంకారమే కదా పతనానికి కారణమయ్యేది. ఈ అహంకారమే ఎంతటి జ్ఞానినైనా అథోలోకానికి తోసివేస్తుంది. అహంకారాన్ని జయించలేనివాడు ఎన్ని విద్యలు తెలిసినప్పటికీ, సర్వ వేదాల సారమూ గ్రహించినప్పటికీ, సర్వ యజ్ఞ యాగాదులూ చేసినప్పటికీ వ్యర్థమే అవుతుంది.

ఇలా రోజులు గడుస్తుండగా ఒకరోజు ఆ ఊరి వేదపాఠశాల వార్షికోత్సవం జరిగే రోజు వచ్చింది. ఎప్పటిలాగే ఈ సభకి కూడా విష్ణుశర్మనే ముఖ్య అతిథిగా పిలిచారు. సభ ప్రారంభం అయ్యే సమయానికి అయిదు నిమిషాలకి ముందుగా వేదికను అలంకరింపవలసిన ముఖ్య ఉపాధ్యాయులు ఒకరు తప్ప అందరూ వచ్చారు. ఆదిత్యశర్మ అనబడే సంస్కృత ఉపాధ్యాయుడు ఇంకా రావలసి ఉంది. అతను కూడా రాగానే సభ ప్రారంభిస్తారని అందరూ తలిచారు. ఆ అయిదు నిమిషాలు కూడా గడిచాయి. కానీ ఆదిత్య శర్మ ఇంకారాలేదు. కార్యక్రమానికి వచ్చిన విష్ణుశర్మ చిరాకు పడుతూ ముఖ్య ప్రధానోపాధ్యాయుని పిలిచి ఏమయ్యా! ఆదిత్య శర్మ ఇంకా రాలేదే, అతనికోసం ఇంకెంతసేపు ఎదురు చూడాలి. ఇంతమంది ఉన్నారు కదా. సభని ఇంక ప్రారంభించేద్దాం అని అన్నాడు. అప్పుడు ప్రధానోపాధ్యాయుడు స్వామీ! ఒక్క పావుగంట సమయం ఆగుదాం. ఆదిత్య శర్మ ఎంతో సౌమ్యుడు. ఏదో ముఖ్యమైన పని వలన అతనికి ఆలస్యం అయి వుండవచ్చును. ఒక్క పది నిమిషాలు వేచి చూద్దాం అని అన్నాడు.

ఇందుకు విష్ణుశర్మ కోపంగా 'ఏమిటయ్యా, అతనికోసం ఎదురు చూసేది. అతనేం గొప్ప మహానుభావుడా, అతనేమైనా నారదునివంటివాడా, లేక సప్త ఋషుల్లోనివాడా, అతనికోసం సభను ఆపటం ఏమిటి! అని ఈసడించుకున్నాడు.

ఆదిత్య శర్మ శాస్త్రాలన్నింటిలోనూ నిష్ణాతుడు అయినప్పటికి అణిగి, మణిగి ఉండేవాడు. వీసమంత గర్వం కూడా లేకుండా ఎంతో సౌమ్య స్వభావంతో ఉండేవాడు. శ్రీమన్నారాయణుడంటే ఎంతో భక్తి కలవాడు. అంతే కాక తనతోటివారందరిలో ఆ స్వామినే చూసేవాడు. ప్రతిరోజు త్రికాలములందును విష్ణుసహస్రనామ పారాయణం చేస్తుండేవాడు. ఆ రోజు సాయంత్రం పాఠశాల వార్షికోత్సవ సభకు ఇంటినుండి బయలుదేరుతుండగా అనుకోకుండా వేరేవూరి నుండి బంధువులు రావడం వలన తన పారాయణం కొంచెం ఆలస్యమయ్యింది. అది ముగించుకొని బయలుదేరేటప్పటికి సభ ప్రారంభసమయానికి రాలేకపోయాడు.

ఇక్కడ సభా ప్రాంగణంలో విష్ణుశర్మ చిందులు తొక్కుతున్నాడు. అక్కడ ఉన్న మిగిలిన పెద్దలందరు ఇతని కోపం, భరించలేక సభ ప్రారంభించారు. ప్రారంభించిన పది నిముషాలకే ఆదిత్యశర్మ వచ్చాడు. వచ్చి తన కుర్చీలో కూర్చోగానే విష్ణుశర్మ అతని వంక ఒక తీక్షణమైన చూపు చూసి తనలో తాను ఏదో గొణుక్కున్నాడు. సభ సాగిపోయింది. ఎవరు దారిన వారు వెళ్ళిపోయారు.

ఇది జరిగిన రెండు రోజులకే విష్ణుశర్మ అనుకోకుండా తీవ్ర అనారోగ్యానికి లోనయ్యాడు. అకస్మాత్తుగా అతనికి పక్షవాతం వచ్చి శరీరమంతా పట్టు నశించింది. పూర్తిగా మంచంమీద పడ్డాడు. నెలలు గడుస్తున్నాయి. ఎంతో మంది వైద్యులు వచ్చి ఎన్నో రకాల మందులు



ఇచ్చి వెళుతున్నారు. కానీ ఏ మాత్రం నయం కావడం లేదు. అసలు ఉన్నట్టుండి ఈవిధంగా తనకు ఎందుకు అనారోగ్యం వచ్చిందా అని బాధ పడేవాడు. విష్ణుశర్మకు రోజు రోజుకీ ఇంకా ఓపిక తగ్గుతోంది. ఎక్కడెక్కడి ప్రముఖ వైద్యులో వచ్చి ఎన్ని విధాల ప్రయత్నించినప్పటికి ఏ మాత్రం ఉపశమనం కలగడం లేదు.

రోజులు ఇలా గడుస్తుండగా ఒకనాడు ఆ ఊరికి ఒక సాధువు వచ్చాడు. ఆ సాధువు ఎంతో మహిమ కలవాడని కేవలం ఒక్క మంత్రంతో ఎటువంటి అనారోగ్యాన్నయినా నయం చేయగడలని ప్రజలు చెప్పుకుంటున్నారు. ఈ విషయం విష్ణుశర్మ చెవిన పడింది. భార్యను పిలిచి ఆ సాధువు వద్దకు వెళ్ళి ప్రాధేయపడి ఏవిధంగానైనా ఇంటికి తీసుకురావలసిందిగా చెప్పాడు. భార్య అలాగేనని చెప్పి ఆ సాధువు వద్దకు వెళ్ళి విష్ణుశర్మ అనారోగ్యం చెప్పి ఎంతో ప్రాధేయపడగా మరునాటి ఉదయం వస్తానని చెప్పాడు. తప్పక రాగలను అని అన్నాడు.

మరుసటి రోజు చెప్పినట్లుగానే సాధువు విష్ణుశర్మ ఇంటికి వచ్చాడు. సాధువును చూసిన విష్ణుశర్మ కళ్ళనీళ్లు పెట్టుకుని తన అనారోగ్యం ఎలాగైనా తగ్గిపోయేలా అనుగ్రహించమని ప్రాధేయపడ్డాడు. స్వామీ! మహానుభావా! ఎన్నో శాస్త్రాలు చదివి, ఎన్నో యజ్ఞయాగాదులు చేసిన నాకు ఈ పరిస్థితి ఏమిటి? ఏ పూర్వజన్మలోనో చేసిన పాపం నన్నీవిధంగా బాధిస్తున్నది కాబోలు. దయచేసి నన్ను ఈ అనారోగ్యం నుంచి తమరు ఎలాగైనా కాపాడి అనుగ్రహించవలసింది' అని వేడుకున్నాడు.

అప్పుడు ఆ సాధువు ఒకనిమిషం కనులు మూసుకుని ఏదో స్ఫురించినవాడై విష్ణుశర్మతో ఇలా అన్నాడు. 'నాయనా! ఈ అనారోగ్యం నీవు ఇంతకు ముందు జన్మలలో చేసిన కర్మ ఫలం వలన కాదు. ఇది

పూర్తిగా ఈ జన్మలోనిదే. అదీ కేవలం కొన్ని నెలల కిందటి విషయమే. నీవు మీ గ్రామంలోని వేద పాఠశాల వార్షికోత్సవం నాడు ఎంతో సౌజన్యమూర్తి అయిన ఆదిత్యశర్మను అకారణంగా నిందించావు, శ్రీమన్నారాయణులవారికి అతి ప్రీతికరమైన భక్తుని నిందించడం వలననే నీకీ దుస్థితి పట్టుకున్నది. శ్రీమన్నారాయణుడు భక్త పరాయణుడు. తన భక్తులను ఎవరైనా, ఎంతటివారైనా ఒక్క మాటన్నా సహించడు. ఆ మాట అన్నది మరొకభక్తుడైనా సరే! తన భక్తులను ఎవరు కష్టపెట్టినా, ఈసడించుకున్నా, అన్యాయం చేసినా సహించడు. ఆ స్వామికి భక్తులంటే అంతటి అభిమానం. తన భక్తుని హింసించినవారు ఎంతటివారైనా ఉపేక్షించడు. వారు తమ బాధ తనతో మొర పెట్టుకోకపోయినా తనంతట తానే వచ్చి వారిని రక్షిస్తాడు. ఆ మాటలు అన్నది దేవతలైనా సరే శ్రీమన్నారాయణుడు ఉపేక్షించడు. సకల దేవతలూ అడ్డు వచ్చినా లెక్క చేయడు. శ్రీ స్వామివారు తన భక్తులమీద ఈగ వాలినా సహించడు. ఓయీ విష్ణుశర్మా! నీవు ఎన్నో వేదాలు చదివి ఉండవచ్చు. ఎన్నో యజ్ఞాలు చేసి ఉండవచ్చు, నీవు కూడా విష్ణు భక్తుడవే అయి ఉండవచ్చు, అంత మాత్రాన మరొక భక్తుడిని కొంచెం కించ పరిచినా ఆ స్వామికి ఆగ్రహం వస్తుంది. నీవు చేసింది అదే. అందుకే నీకీ దుస్థితి కలిగింది. నువ్వు తక్షణమే ఆదిత్యశర్మను నీ వద్దకు పిలిపించుకుని క్షమించవలసిందిగా ప్రాధేయపడాలి. అప్పుడే నీకు పాప నివృత్తి కాగలదు. ఇలా చేసిన పిమ్మట త్వరలోనే నీకు పూర్తి ఆరోగ్యం ప్రాప్తించగలదు. అని చెప్పాడు. ఆ మరునాడే విష్ణుశర్మ సాధువు చెప్పినట్లుగా చేసి ఆదిత్యశర్మకి క్షమాపణ చెప్పి కొన్ని రోజులకు పూర్తిగా ఆరోగ్యవంతుడయ్యాడు.



శ్రీనివాసుని తన భక్తులంటే అంతటి ప్రేమ, అనురాగం. తన భక్తులు ఈ విశ్వంలో ఎక్కడ వున్నా సరే. వారికి ఎంత చిన్న ఆపద కలిగినా, అవమానం జరిగినా, కష్టం కలిగినా తక్షణం ఆదుకునే అమృతమూర్తి ఆ శ్రీనివాసుడు.

ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "*

# పూర్వాషాఢ

పూర్వాషాఢ నక్షత్రానికి అధిదేవత జలదేవత. ధనస్సు రాశిలోని ఈ నక్షత్రం పూర్వకాలంలో నీటి చుక్క అనే పేరుతో కూడా వ్యవహరించబడేది. శ్రీమన్నారాయణులవారు త్రేతాయుగంలో ధనుర్ధారి అయిన శ్రీరామచంద్రునిగా వెలసి రావణ సంహారం గావించాడు. పూర్వాషాఢ నక్షత్రం రోజున శ్రీనివాసుని స్మరించినా, దర్శించినా సకల సౌభాగ్యాలూ ఒనగూరుతాయి, సర్వ ఐశ్వర్యాలూ లభిస్తాయి.

ఒకసారి త్రిలోక సంచారం చేస్తున్న నారదుడు ఇంద్రలోకానికి వచ్చాడు. ఇంద్రుడు ఏదో ముఖ్యమైన పని మీద వెళుతున్నట్లుగా నారదునికి తోచింది. నారదుని రాకను గమనించిన ఇంద్రుడు మహర్షికి నమస్కరించి, 'ఓ మహానుభావా! తమవంటి పుణ్యాత్ముల రాక నాకెంతో సంతోషం కలిగించింది. ఎల్లవేళలయందు శ్రీమన్నారాయణుని నామాన్ని జపించే నీవంటివారి దర్శనం ఎంతో పుణ్యప్రదమైనది. ఆ స్వామి భక్తులను దర్శిస్తే స్వామిని దర్శించినట్లే కదా. రోజుకి ఒక్కసారి నారాయణ నామం జపిస్తేనే ఎంతో పుణ్యం వస్తుందంటారు కదా. అటువంటిది ఇక ఎల్లప్పుడూ ఆ



స్వామినే తలచే మీ పుణ్యం ఎంతటిదని చెప్పను. మీ వంటి మహనీయుల దర్శనం ఎంతో అదృష్టకరం. మహదానందకరం. మీకివే మా నమస్కారములు అని అన్నాడు.

అప్పుడు నారదుడు ఇంద్రునితో ఓ మహేంద్రా 'శ్రీమన్నారాయణుడు భక్త పరాయణుడు. ఆ స్వామి అనుగ్రహం నీకెల్లప్పుడూ ఉండు గాక అని ఆశీర్వదించి ఇంతకీ నీవు ఎక్కడికో ముఖ్యమైన పనిమీద వెళుతున్నట్లుగా అనిపిస్తున్నది. నీ పయనం ఎక్కడికో తెలుసుకొనవచ్చా అని అన్నాడు. అప్పుడు ఇంద్రుడు స్వామీ! తప్పక చెపుతాను. నేను భూలోకానికి పయనమవుతున్నాను. ఈ సమయంలో మీరు ఎదురు రావటం నాకెంతో సంతోషంగా వున్నది. నాకు ఒక సంశయం ఉన్నది. దయచేసి ఈ విషయమై వివరించటానికి మీకంటే మిక్కిలి యోగ్యుడు మరొకరు ఉండరు. నేను భూలోకానికి వెళ్లినప్పుడు అక్కడ అసలైన విష్ణు భక్తులను ఎలా గుర్తు పట్టగలనో చెప్పవలసింది. యజ్ఞ యాగాదులు చేసేవారా? ప్రతి రోజూ శ్రీమన్నారాయణులవారి దేవాలయాలకు వెళ్ళేవారా? లేదా రోజు విష్ణుసహస్రనామ పారాయణం చేసేవారా? లేదా నిత్య పూజలు చేసేవారా లేక దానధర్మాలు చేసేవారా, రోజూ త్రికాల సంధ్య చేస్తూ నిత్య పూజలు చేసేవారా? వీరిలో ఎవ్వరు శ్రీనివాసునికి ప్రియభక్తులు! అసలైన విష్ణుభక్తులను ఏవిధంగా గుర్తించవలసిందో వివరంగా చెప్పవలసింది' అని అడిగాడు.

అప్పుడు నారదులవారు ఇంద్రునితో ఇలా చెప్పసాగాడు. 'ఓ మహేంద్రా! చాలా మంచి ప్రశ్న వేశావు నాయనా! శ్రీమన్నారాయణుడు భక్త పరాయణుడు. ఆ స్వామికి తన భక్తులే సర్వస్వం. తన భక్తుల సంరక్షణకోసం ఏ దేవతలు అడ్డు వచ్చినా లెక్క పెట్టడు. తననే శరణాగతి వేడి, నమ్మినవారిని సర్వకాల సర్వావస్థలయందు రక్షించే అమృతమూర్తి ఆ

శ్రీమన్నారాయణుడే. ఆ స్వామికి కావలసినది నిర్మలమైన భక్తి. నిర్మల మనస్సుతో కేవలం ఒక్క తులసీదళం సమర్పించినా ఎంతో మురిసిపోతాడు. ఆర్తితో కొలచినవారు ఎవ్వరైనా సరే వారు చక్రవర్తులా, సామంతులా, సేవకులా, సామాన్య ప్రజలా అని చూడకుండా అన్ని సౌభాగ్యాలూ వెంటనే అనుగ్రహిస్తాడు. యజ్ఞ యాగాదులు చేశామని అహంకారంతో విర్రవీగితే అది నిర్మలభక్తికి ఏ మాత్రం సాటిరాదు. అలాగే ప్రతిరోజూ గంటలకొలది పూజలు చేస్తున్నామనే అహంకారం ఉంటే ఆ స్వామి అనుగ్రహం ఏ మాత్రం కలగదు. శ్రీనివాసునికి కావలసిన స్వచ్ఛమైన, పరిపూర్ణమైన భక్తి. తన నామాన్ని ఎవరైతే ప్రేమతో, ఆర్తితో జపిస్తారో వారిని ఎల్లవేళలా కాపాడుతూ ఉంటాడు. అంతటి మహోన్నతమూర్తి ఆ శ్రీనివాసుడు.

ఓ ఇంద్రా! నీ సందేహానికి సమాధానం చెప్తాను, వినవలసింది. నిజమైన భక్తులను ఎలా గుర్తించాలనే కదా నీ అనుమానం! ఓ ఇంద్రా ఎక్కడైతే నిజమైన విష్ణుభక్తులు ఉంటారో అక్కడ వీచే గాలి నిర్మలంగా, దివ్యంగా ఉంటుంది. ఆ గ్రామంలో అందరూ ఎల్లప్పుడూ సుఖసంతోషాలతో ఉంటారు. అటువంటి భక్తులు ఉండే గ్రామాలతో పాటు చుట్టు ప్రక్కల ఉండే గ్రామాలన్నీ సస్యశ్యామలంగా ఉంటాయి. నిజమైన విష్ణుభక్తులు ఉండే గ్రామంలో ఉన్నవారెవ్వరికీ అహంకారం, ఆవేశం ఉండవు. ఎంతో ప్రశాంతచిత్తులై ఉంటారు. నిష్కల్మషమైన విష్ణుభక్తులండే గ్రామానికి ఎప్పటికీ కరువు కాటకాల బెడద ఉండదు. కుంభవృష్టి ప్రసక్తే ఉండదు. వానలు సకాలంలో వర్షిస్తాయి. ఎండలు తీవ్రంగా ఉండవు. అన్ని వృత్తులవారు సుఖసంతోషాలతో వుంటారు. నిర్మలమైన భక్తులు ఉండే గ్రామంలో పిల్లి, కుక్క వంటి జంతువులన్నీ జాతి వైరం మరచి సహజీవనం చేస్తాయి. ఆ గ్రామంలో ఎవ్వరికీ కూడా అకాలమరణం సంభవించదు. ఎటువంటి అనారోగ్యం దరి చేరదు. ఎంతటి అనారోగ్యంతో ఉన్నవారైనా ఆ గ్రామం



పొలిమేరల్లోకి రాగానే ఆరోగ్యవంతులౌతారు. ఎంతటి దుర్మార్గులైనా ఆ గ్రామంలోకి ప్రవేశించగానే సన్మార్గులౌతారు. ఓ మహేంద్రా ఇప్పుడు నేను చెప్పిన ఈ విశేషాలన్నీ నీకు ఎక్కడ కనిపిస్తాయో ఆ ప్రదేశంలో అసలైన విష్ణుభక్తుడున్నాడని గమనించు. ఆ ప్రదేశంలోనే ఎక్కడో తప్పక గొప్ప విష్ణుభక్తుడు ఉన్నాడని గ్రహించు. అటువంటి భక్తులు చూడటానికి వేషధారణలో పండితుల లాగా కన్పించరు. అతి సామాన్యంగా ఉంటారు. వారిని వారి వస్త్రధారణతోనూ, వారి మాటల వలననో, వారి చేష్టలవలననో వారిని గ్రహించలేము. నేను మునుపు చెప్పిన విశేషాలన్నీ ఎక్కడ ఉంటాయో అక్కడ ఆ స్వామికి అత్యంత ప్రీతిపాత్రుడైన భక్తుడు ఉన్నాడని గ్రహించు అని చెప్పాడు.

అప్పుడు ఇంద్రుడు నారదునితో స్వామీ! నేను ధన్యుడను. విష్ణుభక్తులను గురించి ఎంతో చక్కగా వివరించి నన్ను అనుగ్రహించినందుకు నేనెంతో కృతజ్ఞుడ్ని. శ్రీమన్నారాయణుని భక్తులు ఎంతో అదృష్టవంతులో కదా. ఆ స్వామి ఎల్లప్పుడూ వారిని వెయ్యి కళ్ళతో కాపాడుతూ ఉంటాడు. అంతటి పరబ్రహ్మమూర్తికి ఇవే మా నమస్కారాలు అని ఇంద్రుడు అన్నాడు. నారదుడు తిరిగి తన లోకసంచారానికై పయనమయ్యాడు.

తిరుమలలో శ్రీ వేంకటేశ్వరునిగా వెలసి, భక్తులను అనుగ్రహిస్తున్న శ్రీమన్నారాయణుడు ఆశ్రిత భక్త వత్సలుడు. తాను నిత్యం ఆనందంలో వుంటూ తనను ఆశ్రయించినవారందరినీ కూడా ఆనందంలో ముంచే అమృతమూర్తి ఆ ఆనంద నిలయుడు. ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*“ శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ”*

# ఉత్తరాషాఢ

ఉత్తరాషాఢ నక్షత్రానికి అధి దేవతలు విశ్వదేవతలు. ఉత్తరాషాఢ నక్షత్రం నాడు శ్రీమన్నారాయణుని తలచినా, అర్చించినా ఎంతో పుణ్యం లభిస్తుంది. ఉత్తరాషాఢంతో కూడిన ఆదివారం నాడు శ్రీనివాసుని దర్శించిన వారిని సర్వ సౌభాగ్యాలూ కలుగుతాయి.

శ్రీమన్నారాయణుడు భక్త సులభుడు. తననే నమ్మిన భక్తులనుఎల్లప్పుడు రక్షిస్తూ ఉంటాడు. తన భక్తులకు సేవ చేసే వారికి కూడా సంపదలు కూరుస్తాడు. తన భక్తులంటే స్వామికి ఎంతో ప్రీతి. ఎంతో మమకారం. వారికి ఏ చిన్న ఆపద కలిగినా ఆ బాధ తనకే అన్నట్లు బాధపడతాడు. తన భక్తులకు కనీసం కాలిలో ముల్లు గుచ్చుకున్నా సహించలేడు. తన భక్తులకు శ్రీనివాసునికి అంతటి అన్యోన్య ప్రేమ. తన భక్తులకు చిన్న మేలు చేసినా సరే, ఆ చేసిన వారికి సర్వ సౌభాగ్యాలూ అనుగ్రహిస్తాడు. తన భక్తులు ఎండలో వెళుతున్నప్పుడు వారికి చల్లని



నీరు ఇచ్చిన వారికి వేయి అశ్వమేధ యాగ ఫలం అనుగ్రహిస్తాడు. తన భక్తులను ఎవరు తమ ఇంట భోజనానికి ఆహ్వానిస్తారో వారికి వేయి గోవుల దాన ఫలితం అనుగ్రహిస్తాడు. విష్ణు భక్తునకు ఏ దానం చేసినా ఆ దాన ఫలం కోటిరెట్లు అధికంగా ఉంటుంది.

కోసల రాజ్యంలో కేశవుడనే భక్తుడు ఉండేవాడు. గంపెడు సంసారంతో కేశవుడు ఎంతో బాధపడుతూ సంసారాన్ని ఈడ్చుకుచ్చేవాడు. ఎల్లప్పుడూ స్వామినే ప్రార్థిస్తూ ఉండేవాడు. అంతటి కష్టాలలో కూడా స్వామిని గురించి తలచకుండా ఒక్కరోజు కూడా ఉండేవాడు కాదు. ఇలా రోజులు గడుస్తుండగా కష్టాలు ఇంకా ఎక్కువ కాసాగాయి. ఒక రోజు ఇంటికి నడిచి వస్తుండగా స్వామి ఎందుకు తనను కరుణించుటలేదా అనే ఆలోచనలో పడ్డాడు. ఏమిటి స్వామీ! నువ్వు నీ భక్తులను ఎల్లవేళలా కాపాడుతూ ఉంటారంటారే, మరి నన్ను ఎందుకు ఇంత బాధలకు గురి చేస్తున్నావు తండ్రీ!' అని అనుకుంటుండగా ఇంతలో ఆకాశం నుండి ఇలా వినబడింది. కేశవా! నేను శ్రీనివాసుణ్ణి మాట్లాడుతున్నాను. నువ్వు అనుభవిస్తున్న బాధలన్నీ చూస్తున్నాను. నేను నిన్నేమీ పట్టించుకోవటల్లేదని అనుకుంటున్నావు కదా! ఒక్కసారి నీ వెనుకకు తిరిగి చూడు. నీ వెనకే నేనున్నాను, నాలుగు పాదముద్రలు కనపడతాయి అన్నాడు.

వెనకకు తిరిగి చూసిన కేశవుడు ఆశ్చర్యపోయాడు. తన వెనుక నాలుగు పాద ముద్రలు ఉన్నాయి. తాను నడుస్తున్నప్పుడల్లా తన రెండు కాలిముద్రలతో పాటు వెనుకలే మరో రెండు ముద్రలు కనపడుతున్నాయి. అప్పుడు గ్రహించాడు. స్వామి తన వెంటే ఉన్నాడు. సంతోషంతో, ధైర్యంతో ఇంటికి చేరాడు.

ఇలా కొన్ని రోజులు గడిచాయి. కేశవునికి కష్టాలు ఇంకా

ఎక్కువయ్యాయి. స్వామి తనతో పాటు ఉన్నాడనే ధైర్యంతో జీవితాన్ని లాక్కుని వస్తున్నాడు. ఒకరోజు యధాలాపంగా వెనుకకు తిరిగి చూసిన కేశవునికి ఆశ్చర్యం వేసింది. తనవెనకాల ఇంతకు ముందు ఉన్న మరో రెండు ముద్రలు లేవు! ఇదేంటి శ్రీనివాసా! కష్టాలు ఇంత కంటే కొంచెం తక్కువ ఉన్నప్పుడు నా వెనకాలే ఉన్నావు. కష్టాలు ఎక్కువయ్యాక మాయమయ్యావేమిటి తండ్రీ! ఆర్త జన రక్షకుడవంటారే? భక్త జన సులభుడంటారే! మరిదేమిటి స్వామీ! ఈ కష్టాలు భరించలేని సమయంలో నువ్వు నన్ను వదలిపెట్టి వెళ్లిపోయావు. ఇది నీకు భావ్యమా తండ్రీ! అని మనస్సులో తలుస్తూ నడుస్తున్నాడు. వెంటనే శ్రీమన్నారాయణుడు ఆకాశం నుండి ఇలా పలికాడు. నాయనా కేశవా! నన్నెంత తక్కువగా అంచనా వేశావు నాయనా! నీ బాధ నేను అర్థం చేసుకోగలను, నా భక్తులకు చిన్న కష్టం కలిగినా, సహించని నేను, నీకు ఇలా కష్టాలు ఎక్కువవగానే వదిలివేస్తానని ఎందుకు అనుకున్నావయ్యా? నీకొక సంగతి చెపుతున్నా విను. నీకు నీ వెనుకల కనిపిస్తున్న పాద ముద్రలు ఎవరివనుకున్నావు. అవి నావే, నీ కష్టాలు ఎక్కువవడంతో నిన్ను నా భుజాల మీద ఎక్కించుకుని మోస్తున్నాను. నీ సంసారం భారం అంతా నేనే వహిస్తున్నాను. అందుకే నీకు రెండు పాదముద్రలే కనిపిస్తున్నాయి. నీవు నా భుజాల మీద ఉండటం చేత నీ పాద ముద్రలు కనిపించుట లేదు. నీవు చూస్తున్నది నా పాద ముద్రలే అని అన్నాడు.

అప్పుడు కేశవునికి విషయం అర్థమయ్యింది. 'స్వామి! శ్రీనివాసా! జగన్నాథా! జగన్నాయకా! నా అజ్ఞానంతో నిన్ను అనవసరంగా నిందించాను. క్షమించు తండ్రీ క్షమించు. నీకు భక్తులపైగల ప్రేమ ఎంతటిదో నేను గ్రహించలేకపోయాను. ఎంతో అల్పబుద్ధితో ఆలోచించాను. నన్ను క్షమించి అనుగ్రహించవలసింది.



స్వామీ నీకు నీ భక్తులపై గల అనన్య అనురాగాన్ని గ్రహించలేకపోయాను. క్షమించు తండ్రీ అని చెంపలేసుకున్నాడు.

శ్రీనివాసుడు భక్త పరాయణుడు, అమృతమూర్తి. ఓ శ్రీనివాసా నీకివే మా నమస్కారములు. మమ్ములను ఎల్లప్పుడూ కంటికి రెప్పలా కాపాడే శ్రీమన్నారాయణా నీకివే మా ప్రణామములు.

ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "*

# శ్రవణం

శ్రవణా నక్షత్రానికి అధిపతి శ్రీమహావిష్ణువు. విష్ణువు అంటే సర్వ వ్యాపకుడు అని అర్థం. ఈ విశ్వమంతా వ్యాపించి ఉన్న శ్రీమన్నారాయణుడు విష్ణువు అని పిలవబడుచున్నాడు. సకల చరాచర జీవకోటి హృదయాలలో పరబ్రహ్మమూర్తిగా, ఆత్మజ్యోతి స్వరూపంలో ఉన్నది ఈ శ్రీనివాసుడే.

ఈ సృష్టిలోని సకల దేవతా నామాలు అతనివే. అందరు దేవతలూ విష్ణు స్వరూపాలే. మనం ఏ నామంతో పిలిచినా, ఏ దేవతను అర్చించినా అది చివరకు ఆ స్వామికే చెందుతుంది. ఆ అమృతమూర్తికే చెందుతుంది. ఆ అమృతమూర్తికే చేరుతుంది. ఈ సృష్టిలోని సహస్రకోటి నామాలన్నీ ఆ స్వామివే!

సకల చరాచర ప్రాణుల ఇంద్రియములను నియంత్రించువాడు



కాబట్టి శ్రీమన్నారాయణుడు హృషీకేశుడు అనబడుచున్నాడు. హృషీకములు అంటే ఇంద్రియములు. ఇంద్రియములను నియమించేది, ఇంద్రియాలకు అధిపతి ఇతడే. ఈ సృష్టిలోని సకల ప్రాణులను పాలించేవాడు కాబట్టి ఈశానుడు అనబడుచున్నాడు. భూమిని గర్భంనందు ధరించినవాడు కాబట్టి భూగర్భ: అనబడుచున్నాడు.

అమిత పరాక్రమవైన ధనస్సును ధరించినవాడు కాబట్టి, శ్రీమన్నారాయణుడు 'ధన్వి' అని కూడా కొనియాడబడుచున్నాడు. అలాగే ఈ సృష్టిలోని సకల ప్రదేశములను ఏకకాలంలో దర్శించగలవాడు కాబట్టి సర్వ దర్శనః అని పిలబడుచున్నాడు. ఓం సర్వ దర్శనాయ నమః అనేనామాన్ని రోజూ జపించినట్లయితే దృష్టి లోపాలన్నీ నశిస్తాయి.

శ్రీమన్నారాయణుడు వేద పురుషుడు, వేద విదుడు. స్వయంప్రకాశకుడు. ఆ స్వామి దివ్య తేజస్సు వలననే ఈ సృష్టి మొత్తం ప్రకాశిస్తున్నది. అందరిచేత స్తుతించబడినవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు గోవిందా అని అనబడుచున్నాడు. శ్రీమన్నారాయణుడు హంస స్వరూపుడు. హంస జ్ఞానానికి ప్రతీక. హంస రూపంలోనే శ్రీమన్నారాయణులవారు నారదునికి భాగవత జ్ఞానాన్ని బోధించాడు.

శ్రీమన్నారాయణుడు షడ్గుణ పరిపూరితుడు అనికూడా అనబడుచున్నాడు. ఐశ్వర్యము, వీర్యము, యశము, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము అనబడే ఆరు గుణాలచేత సాటిలేనటువంటి అత్యంత తేజస్సుతో వెలిగిపోయే దివ్య మంగళ మనోహర మూర్తి ఆ శ్రీమన్నారాయణుడే.

శ్రీమన్నారాయణునికి సూర్యుడు, చంద్రుడు, పంచభూతాలు, కాలము, యముడు, అనే తొమ్మిదిమంది వేగులు ఉన్నారు. వీరిద్వారా ఈ సృష్టిలో ఎక్కడ, ఏది జరిగినా తక్షణం తెలుసుకుంటాడు. ఈ సృష్టిలోని

అన్ని విషయాలను ఏకకాలంలో వినేవాడు, ఏకకాలంలోనే చూసేవాడు శ్రీమన్నారాయణుడే. శ్రీనివాసుని రూపంలో తిరుమలలో నిత్య పూజలందుకుంటున్న దివ్య మనోహరమూర్తి అతడే.

ఈ సృష్టిలోని సర్వ ఐశ్వర్యాలు ఆ స్వామివే, 'శ్రీ' నే, అంటే సాక్షాత్తూ లక్ష్మీదేవినే భార్యగా కలిగినవాడు కాబట్టి 'శ్రీమాన్' అని పిలవబడుచున్నాడు. సర్వ వేళలయందూ దివ్యాభరణాలు ధరించి యున్న దివ్య మంగళ మనోహర మూర్తి ఆ శ్రీనివాసుడు.

శ్రీమన్నారాయణులవారికి తన భక్తులంటే అమితమైన ప్రేమ. శ్రీ కృష్ణావతారంలో ఒకసారి స్వామి విదురుని ఇంటికి వెళ్ళాడు. సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడే తన ఇంటికి రావడం చూసిన విదురుని ఆనందానికి అంతే లేకుండా పోయింది. మహదానంద పడ్డాడు.

సకల చరాచర సృష్టికర్త శ్రీమన్నారాయణుడు తన ఇంటికి రావడమా? ఆహా! తన జన్మ ధన్యమైనది, ఇంతకు మించిన భాగ్యం ఇంకేమున్నది అని ఎంతో సంతోషపడుతూ స్వామిని లోపలికి ఆహ్వానించాడు. స్వామి వచ్చాడన్న ఆనందంతో విదురుడు ఒళ్ళు మరిచిపోయాడు. అతిథిగా వచ్చిన శ్రీమన్నారాయణునికి అరటిపళ్ళు నైవేద్యంగా ఇచ్చాడు. స్వామీ! ఆర్త జనరక్షకా! ఈ సృష్టి మొత్తం నీవే అయిన నీకు నేనేమి అర్పించగలను తండ్రీ! ఈ చిన్న కానుకను తీసుకుని నన్ను ఆనందింపచేయవలసినది అని నేనే ఒలిచిస్తాను స్వామీ అని అరటిపండు ఒలిచి ఇచ్చాడు. పరంధాముడు ఎంతో ఆనందంగా స్వీకరిస్తున్నాడు. ఇంతలో అటుగా విదురుని భార్య రావడం జరిగింది. అక్కడ జరుగుతున్న విశేషం చూసి ఆశ్చర్యపోయింది. శ్రీకృష్ణుడే స్వయంగా తన ఇంటికి వచ్చాడన్న ఆనందంతో ఉన్న విదురుడు అరటిపండు ఒలిచి, పండును క్రింద పడవేసి



తొక్కలను ఆ స్వామికి ఇస్తున్నాడు. పరిపూర్ణ భక్తి సాగరంలో తేలుతున్న విదురునికి తాను తొక్కను స్వామికి అర్పిస్తున్నాననే ధ్యాసే లేదు. ఆ విషయమే గమనించలేదు.

ఆ శ్రీమన్నారాయణుడు కూడా చక్కగా, సంతోషంగా తొక్కనే నములుతూ మహదానందపడుచున్నాడు. భార్య చెప్పగానే విషయం తెలుసుకున్న విదురుడు చెంపలు వేసుకుని తన అపరాధం మన్నించమని పరిపరి విధాల వేడుకున్నాడు. అప్పుడు శ్రీమన్నారాయణుడు విదురునితో నా భక్తులు అనురాగంతో, ఆప్యాయతతో ఏమిచ్చినా స్వీకరిస్తాను, నీవేమీ బాధ పడవద్దు. నీ అనన్య భక్తికి నాకెంతో సంతోషం కలిగింది అన్నాడు. శ్రీమన్నారాయణునికి తన భక్తులంటే అంత ప్రేమ, అనురాగం.

శ్రీమన్నారాయణునికి తన భక్తులంటేనే కాదు, తన భక్తులకు సేవ చేసేవారంటే కూడా ఎంతో అభిమానం. తన భక్తునికి ఏ చిన్న సహాయం చేసినవారికైనా సర్వ సౌభాగ్యాలూ అనుగ్రహిస్తాడు. పూర్వకాలంలో తిరుమలను అందరూ కాలినడకనే ఎక్కి స్వామిని దర్శించుకునేవారు. ఆ రోజుల్లో ఇప్పటిలాగా ఎటువంటి రవాణా సదుపాయాలూ ఉండేవి కాదు. భక్తులందరూ కాలినడకన వెళ్లి దర్శించుకోవలసిందే. కాలినడక దారిలో ఉండే చెట్లలో ఒక చెట్టుపై వనవిహారిణి అనేచిలుక ఉండేది. ఆ చిలుక చెట్లపై కాయలు ముక్కుతో పొడుచుకుని తినేటప్పుడు కొన్ని కింద పడేవి. వాటిని ఆ దారిన వెళ్ళే స్వామివారి భక్తులు తిని ఆనందించేవారు. ఆ విధంగా తన భక్తులకు ఫలాలు ఇస్తున్నందుకు తెలియక చేసిన పరోక్షంగా భక్తులకు ఆనందం కలిగిస్తున్నందుకు ఆ చిలుకకు ఉత్తమ జన్మను ప్రసాదించాడు శ్రీనివాసుడు. ఆ మరుసటి జన్మలో శ్రీవారి ఆలయంలో అర్చకునిగా పుట్టి స్వామిని జీవితాంతం సేవించుకున్నాడు. ఈ విధంగా

తన భక్తులకు ఎవరు ఏవిధంగా సహాయ పడినా వారిని అనుగ్రహించి, అన్ని కోర్కెలు తీర్చే అమృతమూర్తి శ్రీనివాసుడు.

ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*“ శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ”*



# ధనిష్ఠ

ధనిష్ఠా నక్షత్రానికి అధిదేవతలు వసువులు. మొదటి రెండు పాదాలు మకర రాశికి, చివరి రెండు పాదాలు కుంభరాశిలో ఉండే ఈ ధనిష్ఠా నక్షత్రాన్ని “శీర్షత్రయం” అని కూడా అంటారు. ధనిష్ఠ ఆకాశంలో తల ఆకారంలో ఉండే మూడు చుక్కల గుంపులా కనిపించడం వల్ల ఈ పేరుతో కూడా వ్యవహరించబడుచున్నది.

పూర్వకాలంలో ఒకసారి నారద మునీంద్రుడు లోకసంచారం చేస్తూ విదర్భరాజ్యానికి వచ్చాడు. నారదుని చూసిన ఆ దేశపు చక్రవర్తి ఎన్నో సపర్యలు గావించి ఇలా అన్నాడు. స్వామీ! మీరాకతో నా దేశము, నా ప్రజలు పావనమైనారు. ఎల్లప్పుడు ఆ వైకుంఠవాసునే స్మరించే నీవంటి పుణ్యాత్ములు ఎందరుంటారు. ఆ శ్రీమన్నారాయణుని గుణగుణాలను నీ ద్వారా వినడం కంటే మించిన భాగ్యం ఏముంటుంది? దయచేసి ఆ స్వామి అమృతతత్త్వాన్ని గురించి, భక్తవాత్సల్యతగురించి వివరించవలసింది.

మేమందరమూ ఆ శ్రీమన్నారాయణుని గుణగణాలను మీ ద్వారా వినాలని ఎంతో ఉబలాటపడుతున్నాము అని విన్నవించాడు.

అప్పుడు నారదుడు ఆ రాజుతో 'ఓ రాజా! ఎంతటి చక్కటి విషయం గురించి అడిగావు. ఈ సృష్టిలో శ్రీమన్నారాయణులవారి గుణగణాలను తలచుకోవడం కంటే మించిన ఆనందం ఏమున్నది. ఎవరి నామ మహిమచేత సర్వదేవతా గణమూ వారి వారి శక్తులు పొందుతున్నారో, ఎవరి అనుగ్రహం కోసం సమస్త మునిగణమూ కొన్ని కోట్ల సంవత్సరాలుగా తపస్సు చేస్తున్నారో, ఎవరి నామ స్మరణచే బ్రహ్మ సృష్టి చేసే శక్తిని పొందగలుగుతున్నాడో ఎవరి నామ సంకీర్తనచే సర్వ గాన గంధర్వులందరూ పునీతులైతున్నారో ఎవరు సకల జీవరాశులయందు అంతర్యామియై వెలుగొందుతున్నారో అతడే శ్రీమన్నారాయణుడు' అని ఇంకా ఇలా చెప్పసాగాడు.

ఓ రాజా! శ్రీమన్నారాయణుడు భక్త సులభుడు. ఆ స్వామికి తన భక్తులంటే వల్లమాలిన ప్రేమ. పూర్వకాలంలో భూలోకంలో ధనగుప్తుడు, జయగుప్తుడు, విజయగుప్తుడు అనే ముగ్గురు వ్యాపారులు ఉండేవారు. వారు అనేక వ్యాపారాలు చేసి ఎంతో సొమ్ము సంపాదించారు. అయితే ఏ వ్యాపారమూ సక్రమ పద్ధతులలో చేయక ప్రజలను ఎంతో మోసగించేవారు. ఒకసారి వారు ముగ్గురూ కలిసి సరుకులు కొనడానికి పట్నం వెళ్లి సాయంత్రానికి తిరిగి ఇంటిదారి పట్టారు. వారి గ్రామానికీ, పట్టణానికీ మధ్య ఒక కాలువ వుంది. పట్నం వెళ్ళాలంటే ఆ కాలువ ద్వారా చిన్న పడవ ఎక్కి అవతలి గట్టు చేరాలి. ఆ పడవలో ఒక్కసారి ఐదుగురు మాత్రమే ఎక్కగలరు. వ్యాపారులు ముగ్గురూ కాలువ గట్టుకు చేరేటప్పటికి అక్కడ పడవలో అప్పటికే ఇద్దరు కూర్చుని వున్నారు. ఆ ఊరి జమిందారు,



అతని నౌకరు రామయ్య పడవలో కూర్చుని కనబడ్డారు. వ్యాపారులు ముగ్గురూ కూడా ఎక్కారు. అంతలో పెద్ద వర్షం ప్రారంభమైంది. ఒక అయిదు నిమిషాలకే వర్షం మరింత పెద్దదై ఉరుములు, మెరుపులతో వాతావరణం భయంకరంగా తయారైంది.

పడవలో వున్నవారందరికీ ఈ వర్షంలో కాలువ ఎలా దాటి వెళ్ళగలమా అని బెంగ పెట్టుకున్నది. ఆ వర్షానికి పడవలో నీరు ప్రవేశించినది. ఇంకా కాలువ సగం కూడా దాటలేదు. వ్యాపారులకి, జమీందారుకు మనస్సులో భయం మొదలైంది. వానకు పూర్తిగా తడిసిపోయారు. అసలీ వర్షం తగ్గి అవతల గట్టుకు ప్రాణాలతో చేరగలుగుతామా అనే బెంగ పట్టుకున్నది. ఇంతలోనే వాళ్ళు ఇలా మాట్లాడుకుంటుండగా కొద్ది దూరంలో భయంకరమైన శబ్దంతో పిడుగు పడింది. అందరి గుండెలు జల్లుమన్నాయి. ఆ శబ్దానికి పడవ కూడా ఒక ప్రక్కకు ఒరగసాగింది. ఇక ప్రాణాలతో అవతలకి చేరతామనే ఆశ నశించసాగింది.

అంతలో ఆ నలుగురు మనలో ఎవరో పాపాత్ములు వుండటంచేతనే ఈ కష్టాలపాలవుతున్నాం. వాడి మూలంగానే మిగిలిన వారందరికీ కూడా ప్రాణాలు పోయే స్థితి వచ్చేలా వున్నది అని తలచారు. అప్పుడు వారందరూ వారిలో ఎవరు పాపాత్ముడా అని తర్జన భర్జనలు చేసి చివరికి నౌకరు రామయ్యనే పాపాత్ముడిగా నిశ్చయించారు. వీడివలననే మనందరి ప్రాణాలకూ అపాయం వచ్చేలాగున్నది. వీనిని తక్షణం ఈ పడవలోంచి బయటకు తోస్తేనే గాని మనం బతికి బయట పడటం అసాధ్యం. అని తలచి ఆ నౌకరు ఎంత మొత్తుకున్నా వినకుండా వానిని నీటిలోనికి తీసివేశారు. అంతే తక్షణం పడవ మునిగిపోయింది. జమీందారు, వ్యాపారులతో సహా నీటిలో మునిగిపోయారు. అదృష్టవశాత్తు నీటిలో

పడిన రామయ్యకు ఒక పెద్ద కలప దుంగ దొరికింది. దాని సహాయంతో ఆ వర్షంలో వాడు అవతలి గట్టుకు క్షేమంగా చేరాడు. ఇంతలో వర్షం కూడా తగ్గింది. తన కళ్ళ ఎదురుగుండానే వారందరూ మరణించటం చూసి రామయ్య చాలా బాధపడ్డాడు" అని నారదుడు చెప్పసాగాడు.

ఓ రాజా! ఇలా ఎందుకు జరిగిందో తెలుసా! ఆ పడవలోని వారందరిలో రామయ్య ఒక్కడే పుణ్యాత్ముడు. ఎప్పుడూ ఏ పాపం చేసి ఎరుగడు. రోజంతా ఒళ్ళు అలిసేలా పనిచేసి రాత్రి పడుకునే ముందు ఒక్కసారి గోవిందా అని తలస్తాడు. అంతే తప్ప ఏ పూజలూ, నోములూ ఎరుగడు. మిగిలినవారందరూ పాపాత్ములు. ఏ రోజూ ఒక్క మంచి పని చేసి ఎరుగరు. శ్రీనివాసుని భక్తాధీనత ఎంతటిదో తెలిసిందా? తన భక్తుడైన రామయ్య వారితో వున్నంతవరకూ వారికి ఎంత పాపాత్ములైనప్పటికీ ఏ ఆపదా కలుగలేదు. స్వామి భక్తుల మహత్యం ఎటువంటిదంటే వారివలన వారి చుట్టుపక్కల వుండేవారు కూడా రక్షింపబడతారు. అందువలననే రామయ్య వున్నంతసేపూ మిగిలినవారందరూ కూడా రక్షింపబడ్డారు. తన భక్తుడైన రామయ్యను అంత వానలో నీటిలోనికి తోసివేసిన ఆ పాపాత్ములను స్వామి ఎంతమాత్రం క్షమించడు. అందువలననే వారికి ఈ గతి పట్టింది. తన భక్తులను ఎవరు, ఏ మాత్రం అవమానించినా, హింసించినా శ్రీమన్నారాయణుడు సహించడు. వారికి తప్పక తగిన బుద్ధి చెప్తాడు. వారు ఎంతటివారైనా ఉపేక్షించడు. శ్రీమన్నారాయణులవారికి తన భక్తులంటే అంతటి ప్రేమ, అంతటి అనురాగం. తనను నమ్మినవారిని నిత్యం రక్షించే అమృతమూర్తి శ్రీనివాసుడు. ఆ శ్రీనివాసుని నమ్మినవారికి ఇక ఏ దేవతలనూ కొలిచే అవసరం లేదు. ఎందుకంటే సర్వదేవతా స్వరూపము అతడే కాబట్టి.



ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా నీకు మా ప్రణామములు. నమ్మినవారికి సర్వ సంపదలూ అనుగ్రహించే జగన్నాథా! అనాథ రక్షకా! జగత్ప్రభూ నీకివే మా నమస్కారములు.

*" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "*

# శతభిషం

శతభిషం అంటే నూరు తారల సమూహం అని అర్థం. శత తారల గుంపు అయిన శతభిష నక్షత్రానికి అధిపతి వరుణుడు. పశ్చిమ దిక్కునకు కూడా అధిపతి అయిన వరుణుడు వర్షకారకుడు.

పూర్వకాలంలో ఒకసారి నవగ్రహాలకు విపరీతమైన గర్వం కలిగింది. తాము తలచుకుంటే ఎంతటి వారినైనా ముప్పతిప్పలు పెట్టవచ్చుననీ, తమ ప్రభావానికి ఎంతటివారైనా లోనుకాక తప్పదనీ అహంకారం కలిగింది. వారికి గల శక్తి అంతా తమనదేననీ, తమ అత్యంత శక్తితో ఏదైనా చేయగలమని తలచారు. ప్రజలు తమ జీవితాలలో శని దశ జరుగుతున్నప్పుడు గానీ, ఏలినాటి శని, అష్టమశని, అర్ధాష్టమ శని జరుగుతున్నప్పుడు గానీ వారెవరూ తన తీవ్ర ప్రభావం నుండి తప్పించుకోలేరని శనీశ్వరుడు తలచాడు. ఇలాగే మిగిలిన గ్రహాలన్నీ తమ శక్తి గురించి ఎంతో గొప్పగా తలచాయి.



నవగ్రహాలు ఈ రీతిన అహంకరించటం శ్రీమన్నారాయణుడు గమనించాడు. ఒకసారి వీరందరికీ తగిన బుద్ధి చెప్పాలనుకున్నాడు. అలా తలచిన క్షణమే వారి వారి శక్తులు సన్నగిల్లసాగాయి. సూర్యుడు తన జాతక దశ నడుస్తున్న ప్రజలు ఎవ్వరికీ తన ప్రభావం చూపలేకపోయాడు. చంద్రుడు మనఃకారకుడు. చంద్రుని ఈ తత్త్వం పూర్తిగా క్షీణించింది. తన ప్రభావం ఎందుకు తగ్గిపోయిందో చంద్రునికి గ్రహింపుకు రావటల్లేదు.

ఈవిధంగానే మిగిలిన గ్రహాలన్నీ తమ ప్రభావాన్ని కోల్పోయాయి. ఎందుకు ఇలా జరిగిందో వారికి అర్థం కావట్లేదు. ఇలా కొన్ని రోజులు గడిచేటప్పటికి నవగ్రహాలకు బెంగ పట్టుకున్నది. వారికి కనబడిన మహాత్ములనందరినీ ఈ విధంగా వారి శక్తులు ఎందుకు తగ్గినవో ఎవరిని కారణం చెప్పగలరేమోనని అడిగినా ఎవ్వరూ చెప్పలేకపోయారు. అప్పుడు వారందరూ కలిసి నారద మహర్షి వద్దకు వెళ్ళారు. నారద మహర్షిని సమీపించి 'ఓ స్వామీ! నీవు మహా తపఃసంపన్నుడవు. నిత్యం ఆ శ్రీమన్నారాయణ నామం జపించే మహా భక్తుడవు. దయచేసి మా అందరి శక్తులూ ఎందుకు సన్నగిల్లాయో తెలుపవలసింది. తిరిగి మా మా శక్తులు పొందే మార్గం సెలవియ్యవలసినది అని అడిగారు.

అప్పుడు నారదులవారు ఒక నిమిషం కళ్ళు మూసుకుని ఏదో స్ఫురించినవారై నవగ్రహాలతో ఇలా అన్నారు. 'నాయనలారా! మీ అందరి శక్తి ఎందుకు ఇలా సన్నగిల్లిందో వివరంగా చెప్తాను వినండి. మీ అందరికీ మీ మీ శక్తుల గురించి ఎంతో అహంకారం కలిగింది. ఆ శక్తి అంతా మీదేనని తలచారు. మీ మీ శక్తులన్నీ ఆ శ్రీమన్నారాయణుని అనుగ్రహం తప్ప మరొకటి కాదన్న విషయం మరిచారు. ఈ సృష్టిలోని సర్వశక్తి

శ్రీమన్నారాయణునిదే! అతని శక్తి వలననే వాయువు వీస్తున్నాడు. ఆ పరబ్రహ్మమూర్తి అనుగ్రహంతోనే వరుణుడు వర్షిస్తున్నాడు. ఈ సృష్టిలోని సర్వదేవతలలోని శక్తి ఆ పరంధామునిదే. సూర్యునిలోని తేజస్సంతా ఆ స్వామిదే. చంద్రునిలోని చల్లదనమంతా ఆ జగత్ప్రభువుదే. మానవులలోని ఇంద్రియాలన్నింటినీ నియంత్రిస్తున్నది ఆ పరబ్రహ్మమూర్తియే. సకల జీవకోటి హృదయాలలో అంతర్యామి స్వరూపంగా ఉన్నది ఆ పరంధాముడే. ఈ విషయం గ్రహించక మీ అందరి శక్తులూ మీ మీ గొప్పతనమని తలచారు. అలాగే శ్రీమన్నారాయణులవారి భక్తులపై కూడా మీ ప్రభావం చూపసాగారు. బాధించసాగారు. ఆ వైకుంఠవాసునికి తన భక్తులంటే ఎంతో అనురాగం. ఆ స్వామి భక్తులను బాధించేవారిని ఏ మాత్రం సహించడు. కాబట్టి మీరందరూ మానవులలో మీ మీ గ్రహదశలు నడుస్తున్నప్పటికీ, వారు గనుక శ్రీమన్నారాయణులవారి భక్తులైతే వారిని ఏ మాత్రం బాధించకండి. ఒకవేళ మీరు మీ అహంకారంతో శ్రీనివాసుని భక్తులను కష్టాలకు గురి చేస్తే ఆ స్వామి ఆగ్రహానికి తప్పక లోనవుతారు. కాబట్టి ఆ స్వామి భక్తులపై మీ మీ గ్రహబాధలు పెట్టవద్దు. అని చెప్పాడు.

నారదులవారు చెప్పిన మాటలన్నీ విన్న నవగ్రహ దేవతలు తమ తప్పు తెలుసుకున్నారు. వెంటనే అందరూ కలిసి వైకుంఠానికి వెళ్ళి ఆ శ్రీమన్నారాయణులవారిని ప్రార్థించి అనేక విధాల స్తుతించి ఇలా అన్నారు. 'ఓ స్వామీ! జగన్నాథా! జగద్రక్షకా! మమ్ములను క్షమింపవలసింది. అహంకారానికి లోనై మేమందరమూ మా శక్తులన్నీ మా గొప్పతనమేనని విర్రవీగాము. ఇదంతా నీ అనుగ్రహమేనని గ్రహించలేకపోయాము. ఓ స్వామి! ఓ పరంధామా! ఓ జగన్నాయకా! మమ్ములను క్షమింపవలసింది. ఇకపై మేము ఎన్నడూ నీ భక్తులను హింసింపము. మా జాతక దశలు



నడుస్తున్నప్పటికీ నీ భక్తులైన వారిని ఏ మాత్రం బాధించము. కనీసం రోజుకి ఒక్కసారైనా నిన్ను స్మరించేవారికి మేము ఎన్నడూ కష్టాలపాలు చెయ్యము. జాతకరీత్యా మానవ గ్రహాలలో ఏ గ్రహదశ నడుస్తున్నప్పటికీ కూడా ఎటువంటి ఆపదలు కలుగజేయము. నీ భక్తులకు ఎప్పుడూ ఎటువంటి గ్రహబాధలూ కలుగవు. అని చెప్పి శ్రీ మహా విష్ణువు వారి దగ్గర సెలవు తీసుకుని వారి వారి స్వస్థలాలకు పయనమైనారు.

అప్పటినుండి శ్రీనివాసుని భక్తులపై నవగ్రహాలు తమ ప్రతాపం చూపడం మానివేసాయి. కాబట్టి ఆ శ్రీనివాసుని రోజులో ఒక్కసారి స్మరించినా ఏ గ్రహ దశలలోనూ ఎటువంటి ప్రతికూల పరిస్థితులు ఏర్పడకుండా జీవితం ప్రశాంతంగా, సంతోషప్రదంగా జరుగుతుంది.

ఈ సృష్టిలోని శక్తిమొత్తం శ్రీనివాసునిదే. సృష్టి మొత్తం వ్యాపించి ఉన్నది ఆ స్వామియే! ఆ స్వామిని నమ్మి, పూర్తిగా శరణాగతి వేడినవారికి ఈ జీవితం ఎంతో తేలికగా ఎటువంటి కష్టాలూ లేకుండా సుఖప్రదంగా గడుస్తుంది.

ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "*

# పూర్వాభాద్ర

పూర్వాభాద్ర నక్షత్రానికి అధిపతి అజైకపాదుడు. వివాహం కావలసిన కన్యలు పూర్వాభాద్ర నక్షత్రంనాడు శ్రీనివాసుని స్మరించినా, దర్శించినా వెంటనే వివాహం నిశ్చయమౌతుంది. ఈ నక్షత్రంనాడు శ్రీనివాసుని దర్శించినవారికి సర్వసౌభాగ్యాలూ కలుగుతాయి.

శ్రీమన్నారాయణుని ఎవరైతే శరణాగతిగా భావించి సర్వం అర్పిస్తారో వారిని ఆ స్వామి సర్వవేళలా కంటికి రెప్పలా కాపాడుతుంటాడు. ఆ స్వామిమీద పూర్తి నమ్మకముంటే చాలు. ఆ భక్తుని బాధ్యత తానే పూర్తిగా వహిస్తాడు.

పూర్వకాలంలో మునిపల్లె అనే గ్రామంలో శేషాచార్యులు అనే అర్చకుడు నివసించేవాడు. శేషాచార్యులు ఆ ఊరి శ్రీ వేంకటేశ్వర ఆలయంలో అర్చకునిగా వుంటూ స్వామిని సేవిస్తూ కాలం గడిపేవాడు. ఆలయానికి వచ్చే భక్తులలో కొందరి కోరికలు వెంటనే నెరవేరటము, మరికొందరివి మరికొంత ఆలస్యంగా నెరవేరటము శేషాచార్యులు గమనిస్తూ వుండేవాడు. స్వామిని ప్రార్థించగానే అందరి కోరికలు వెంటనే ఎందుకు



తీరటం లేదు అని ఆలోచించేవాడు. ఏదో పూర్వజన్మఫలం వలన వారి వారికోరికలు తీరుతున్నాయి. గానీ ఈ స్వామి నిజంగా ఎవరి జీవితాలనైనా పూర్తిగా మార్చివేయగలడా? అని తలచేవాడు. మళ్ళీ కాసేపటికే తన ఆలోచన తప్పుని తోచి చెంపలు వేసుకునేవాడు. ఇలా ఉండగా ఒకనాడు ఆ ఊరిలో కుంభవృష్టి కురిసింది. రెండు రోజులు ఏకధాటిగా వాన. ఆ ఊరికి పక్క ఊరినుంచి ఒక గొల్లవాడు రోజూ వచ్చి పాలు పోసేవాడు. ఆ ఊరికి, ఈ ఊరికి చిన్నకాలువ అడ్డంగా వుండేది. బల్లగట్టుమీదుగా నెమ్మదిగా అటునుంచి ఇటు దాటి రావాలి. వర్షం పెద్దగా పడితే బల్లగట్టు పూర్తిగా మునిగిపోయి రెండుగ్రామాలకి పూర్తిగా సంబంధం తెగిపోయేది. వర్షం పెద్దదిగా వుండటం వలన గొల్లవానికి పాలు తీసుకురావటం కష్టంగా వుంది. మొదటిరోజు అతికష్టంమీద వచ్చాడు. రెండవరోజు ఇక లాభం లేదనుకున్నాడు. అతికష్టంమీద కాలువ దాటి వచ్చి శేషాచార్యులవారింట్లో పాలు పోసి వెళుతూ ఆచార్యులవారితో ఇలా అన్నాడు. స్వామి ఇంత జోరు వానలో రావటం నా వల్ల కాదు. రేపటికి బల్లకట్టుకూడా పూర్తిగా మునిగిపోయేలా వుంది. వర్షం ఇలాగే వుంటే ఇక రేపటినుంచి రాలేను స్వామీ అని ప్రాధేయపడ్డాడు.

శేషాచార్యులవారి గొంతులో పచ్చి వెలక్కాయ పడినట్లైంది. ఉదయాన్నే పాలు లేకపోతే ఎలాగా? అని తలచి ఆ గొల్లవానితో చూడు నాయనా! ఆ కృష్ణ స్వామి వుండగా నీకేం కష్టం. ఆ స్వామిని తలచుకుంటూ చక్కగా వచ్చెయ్. ఈ వర్షం నిన్నేం చేయదులే అని అన్నాడు. ఆ గొల్లవాడు నవ్వుతూ వెళ్ళిపోయాడు.

వర్షం అయిదురోజులైనా తగ్గలేదు. రెండు వూళ్ళలోనూ ఎవరూ ఇండ్లల్లోంచి బయటకు రావడం లేదు. బల్లకట్టు పూర్తిగా మునిగిపోయిందని

ఊర్లోవారికి తెలిసిపోయింది. అయితే విచిత్రంగా గొల్లవాడు మాత్రం ఆచార్యులవారింట్లో పాలు పోయటానికి రోజూ వస్తూనే వున్నాడు. ఆచార్యులవారికి ఇదేం అర్థం కావటం లేదు. ఇంత వర్షంలో ఏ మాత్రం తడవకుండా వీడు రోజూ ఎలా వస్తున్నాడు? ఆ కాలువ పొంగి ప్రవహిస్తుంటే వీడెలా వస్తున్నాడు? అని ఆశ్చర్యపోయాడు! ఆరవ రోజున గొల్లవాడు వచ్చి వెళ్ళిన కాసేపటికి నెమ్మదిగా గొడుగు వేసుకుని అతని వెనకే వెళ్లి చూశాడు. కాలువ దగ్గరకి వెళ్లిన శేషాచార్యులవారికి కనపడిన దృశ్యం చూసి ఆచార్యులవారికి నోటిమాట రాలేద. బల్లకట్టు ఏ మాత్రం కనిపించటం లేదు. కానీ ఆ గొల్లవాడు మాత్రం ఎంతో చక్కగా ఆ ప్రదేశంలో బల్లకట్టు ఉన్నట్లుగానే భావిస్తూ కాలువ దాటేస్తున్నాడు. ఇంకా విచిత్రం ఏమిటంటే ఇంత వర్షంలోనూ అతడు ఏ మాత్రం తడవటం లేదు.

శేషాచార్యులవారికి జరిగినవిషయం అర్థమైంది. తాను ఆ గొల్లవానితో నల్లనయ్యను తలచుకొనమనడం గుర్తుకువచ్చింది. తానుచెప్పిన మాటను పూర్తిగా నమ్మిన వాడు ఆ భారమంతా కృష్ణస్వామిమీదే వేశాడు. ఆ స్వామి తనను తడవకుండా తప్పక కాపాడుతాడని నమ్మాడు. ఆ నమ్మకమే అతడిని రక్షిస్తున్నది. ఈ పాటి నమ్మకం ఇన్ని సంవత్సరాలుగా రోజూ స్వామిని సేవిస్తున్న తనకు కలగనందుకు శేషాచార్యులవారు నొచ్చుకున్నారు.

శ్రీనివాసునికి తన భక్తులంటే అంతటి ప్రేమ. అంతటి అనురాగం. ఎవరైతే వేరే ఆలోచన లేకుండా, ఏ మాత్రం సంశయానికి తావివ్వకుండా పూర్తి భారం తనమీదే వేస్తారో వారి బాధ్యత పూర్తిగా తానే వహిస్తాడు. మనం చెయ్యవలసిందల్లా ఒక్కటే! ఆ అమృతమూర్తి మనలను తప్పక



ఆదుకుంటాడు అనే పూర్తి నమ్మకం ఆ స్వామిపై వుంచటమే. అది చాలు. ఆ స్వామి తప్పక అనుగ్రహిస్తాడు.

ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

*“ శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ”*

# ఉత్తరాభాద్ర

ఉత్తరాభాద్ర నక్షత్రానికి అధిపతి అర్బుద్ముడు. ఉత్తరాభాద్ర నక్షత్రంనాడు శ్రీనివాసుని దర్శించిన వారికి సకల శుభాలు చేకూరుతాయి. సంతానం లేనివారు ఈ నక్షత్రంనాడు శ్రీమన్నారాయణుని పూజిస్తే తప్పక చక్కటి సంతానం కలుగుతుంది.

పూర్వకాలంలో అవంతీ నగరంలో ఒకసారి విపరీతమైన కరువు, కాటకాలు కలిగాయి. మూడు సంవత్సరాలపాటు వానలు కురవలేదు. ప్రజలందరూ అల్లాడిపోతున్నారు. రాజుగారి ఆస్థానంలోని జ్యోతిష్కులు రాజును వరుణయాగం సంకల్పించవలసిందిగా చెప్పారు. ఆ యాగం చేస్తే తప్పక వర్షం కురుస్తుందని, ఈ కరువు పోతుందని, దేశం సస్యశ్యామలం అవుతుందని అన్నారు. కొంతమంది మహాపండితులు ఒక బృందంగా ఏర్పడి మహారాజును కలిసి వరుణయాగం వలన దేశానికి కలిగిన అనావృష్టి తొలగి మంచి వానలు కురుస్తాయని చెప్పారు.

ఆ మహారాజు వీరందరూ చెప్పినదంతా విని యాగం చేయడానికి



నిశ్చయించాడు. వెంటనే ఏర్పాట్లన్నీ బ్రహ్మాండంగా ప్రారంభమయ్యాయి. యాగం నిర్వహించడానికి మహాపండితులు విచ్చేశారు. బ్రహ్మాండమైన యజ్ఞగుండాలు నిర్మించబడ్డాయి. యాగానికి ఏ విషయంలోనూ తక్కువ కాకుండా కావలసిన వస్తువులన్నీ సమకూర్చబడ్డాయి. రుత్విక్కుల అంకురార్పణ మంత్రాలతో యాగం వైభవంగా మొదలైంది. ఆవిధంగా మూడు రోజులు గడిచింది. ప్రతిరోజూ సాయంత్రానికి లఘు పూర్ణాహుతి జరిగేది. కానీ ఆకాశంలో ఎక్కడా వర్షం పడే సూచనలు కానరాలేదు.

అలా ఒక వారం రోజులు గడిచింది. ఇక రేపే పూర్ణాహుతి. వర్షపు ఛాయలు ఎక్కడా కనిపించడం లేదు. అక్కడున్న వారందరిలోనూ నిరాశ, నిస్పృహలు చోటు చేసుకున్నాయి. ఒక్క చినుకు కూడా వర్షం ఎందుకు పడటం లేదో అర్థం కావడం లేదు. యాగం ఎంతో నిష్ఠతో జరుగుతున్నప్పటికీ కనీసం మేఘాలు కూడా ఏర్పడకపోవటం అంతు పట్టటం లేదు. ఇంతలో ఆ ప్రదేశానికి ఒక గొల్లవాడి చేతిలో గొడుగు పట్టుకుని వచ్చాడు. అంతే ఒక్కసారిగా వర్షం ప్రారంభమైంది. అక్కడ వున్నవారంతా ఆశ్చర్యపోయారు. ఇన్ని రోజులుగా పడని వర్షం ఈ క్షణంలో కురవటమేమిటి? రోజూ ఎంతో మంది మహానుభావులు ఈ యాగశాలను దర్శిస్తున్నారు కదా. అయినప్పటికి పడని వర్షం ఇంతటి సామాన్య గొర్రెల కాపరి రావటంతో పడటం ఏమిటి. ఈ గొల్లడు యాగశాల ప్రదేశం దగ్గరకు రాగానే వర్షం ప్రారంభం అవటంలో ఆంతర్యం ఎవరికీ అర్థం కావడం లేదు.

అక్కడివారందరూ ఇలా చర్చిస్తుండగా ఒక వృద్ధబ్రాహ్మణుడు లేచి ఇలా అన్నాడు. చూడండి నాయనలారా! మీరందరూ ఎంతో నిష్ఠతో ఈ యాగం చేస్తున్నారు నిజమే. కానీ మీలో ఎంతమందికి భగవంతుని మీద పూర్తి విశ్వాసం ఉన్నది చెప్పండి? మీలో కొంతమంది ఈ యాగం చేస్తున్నాం

కానీ నిజంగా వర్షం పడుతుందా అని తలచేవారున్నారు. మరికొంతమంది యాగం చేస్తున్నాం కదా, కాబట్టి వర్షం పడితే బాగుంటుంది అని తలచేవారున్నారు. కానీ ఎవ్వరిలో కూడా ఈ యాగం ఎంతో నిష్ఠగా చేస్తున్నాం. ఆ భగవంతుడు తప్పక వర్షాన్ని కురిపిస్తాడు అనే ధృఢమైన నమ్మకం లేదు. ఎవ్వరికీ కూడా ఆ భగవంతునిపై పూర్తి విశ్వాసం లేదు. అంతటి అచంచల విశ్వాసం వున్నది ఆ గొల్లవానికే. ఇంతమంది మహాత్ములు యాగం నిర్వహిస్తుంటే ఆ భగవంతుడు తప్పక వర్షం కురిపిస్తాడు అని నమ్మి వర్షంలో తానెక్కడ తడుస్తానోనని గొడుగు కూడా వెంట తెచ్చుకున్నాడు. భగవంతునియందు విశ్వాసం అంతటిది! అందువలననే అతడు ఈ ప్రదేశంలోనికి రాగానే వర్షం మొదలైంది. భగవంతుని యందు అతని విశ్వాసం వమ్ము కాలేదు. విశ్వాసం యొక్క శక్తి అంతటిది అని చెప్పాడు.

ఎవరైతే తనను పూర్తిగా నమ్మి పూర్తి భారం తనమీదే వేస్తారో వారిని తప్పక ఆదుకునే అమృతమూర్తి ఆ శ్రీమన్నారాయణుడు. ఆ స్వామిని నమ్మినవారికి సర్వ సౌభాగ్యాలూ కలుగుతాయి. భక్తికి విశ్వాసం తోడైతేనే ఫలిస్తుంది. విశ్వాసం లేని భక్తి నిష్ఫలం. అనన్యమైన భక్తిలో విశ్వాసం కూడా మిళితమై వుంటుంది. అంతటి విశ్వాసంతో తనను ఆరాధించిన భక్తుని శ్రీనివాసుడు ఎల్లవేళలా కాపాడుతూ ఉంటాడు. ఏ పూజ కానీ, ఏ వ్రతం కానీ చేసేటప్పుడు తాను సంకల్పించిన పని తప్పక అవుతుందనే విశ్వాసంతో చేసేవారికి తప్పక కార్యసిద్ధి కలుగుతుంది.

ఓ శ్రీనివాసా! నీకివే మా నమస్కారములు. ఓ శ్రీమన్నారాయణా! నీకివే ప్రణామములు. ఓ జగద్రక్షకా! నీకివే మా నమస్కారములు.

" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్
శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "



# రేవతి

నక్షత్ర సమూహంలో చివరిదైన రేవతి నక్షత్రానికి అధిపతి పూషుడు. ఆకాశంలో కనపడే నక్షత్ర సమూహం అంతా కూడా శ్రీమన్నారాయణుని స్వరూపమే. పగలు, రాత్రి నీ ఇరుపక్కలు, నక్షత్రలే నీ స్వరూపము, అశ్వినులే నీ పెదవులు అని వేదంలో శ్రీమన్నారాయణుని విరాట్స్వరూపము గురించి వర్ణించబడింది.

పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు, పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చాస్వరూపమనే అయిదు అవతారాలలో వుంటాడు. వీటిలో మొదటిదైన పరావతారం శ్రీ మహాలక్ష్మి సమేతుడై వైకుంఠంలో వుండే శ్రీమన్నారాయణుడే. ఈ రూపం సామాన్యులకే కాదు. దేవతలకు కూడా దర్శింపడానికి వీలు కలుగనిది. నిత్యము, అప్రమేయము అయిన ఈ స్వరూపంలో దివ్యమంగళ రూపుడైన ఆ స్వామి అనంత, గరుడ, విష్వక్సేన, సనక, సనందనాదులు వంటి మహానుభావులకు మాత్రమే దర్శనమిస్తాడు. అత్యద్భుతమైన ఈ పరమపురుషునికి జీవుడే కౌస్తుభమణి. ప్రకృతి శ్రీవత్స

చిహ్నాము. మహత్తు గదాయుధము. జ్ఞానము ఖడ్గము. అజ్ఞానము కత్తిఒర. శార్‌ఙ్గము, చక్రములే తామస అహంకారాలు. శరములే ఇంద్రియాలు. భూతములు వనమాల. వైకుంఠంలోని శ్రీమన్నారాయణుని యొక్క ఈ పరమపురుష దర్శనం సామాన్యులెవరికీ సాధ్యం కాదు.

ఇక రెండవది వ్యూహావతారం. పాలసముద్రంలో ఆదిశేషునిపై శయనించే శ్రీమన్నారాయణుని దివ్యరూపమే వ్యూహాస్వరూపము. పురుషోత్తమునియొక్క ఈ స్వరూపం కూడా సామాన్యభక్తులకు దర్శింపసాధ్యం కాదు. కేవలం ఈశ్వరుడు, ఇంద్రుడు ఆదిగాగల దేవతలకు మాత్రమే ఇది దర్శనీయం. ఈ వ్యూహాస్వరూపమే వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులనబడే నాలుగు రకాలుగా వుండే స్థితి. ఈ వ్యూహరూపాలలో వాసుదేవుడు మోక్షప్రదాత. సంకర్షణుడు జ్ఞానము, బలము ఇచ్చే స్వరూపము. ప్రద్యుమ్నుడు ఐశ్వర్యము, వీర్యముల ప్రదాత. అనిరుద్ధుడు శక్తి, తేజస్సులను అనుగ్రహిస్తాడు.

ఇక మూడవది విభవ రూపము. ఈ రూపంలో స్వామి ప్రపంచంలో ధర్మానికి హాని కలిగినపుడు దుష్ట శిక్షణ, శిష్ట రక్షణార్థమై అవతరిస్తుంటాడు. ఈ అవతారాలు ఏ పరమార్థం కోసం శ్రీమన్నారాయణుడు అవతరించాడో ఆ కార్యం పూర్తికాగానే సమాప్తమౌతాయి. విభవావతారం మళ్ళీ రెండు రకాలుగా వున్నది. ఇవే ప్రాదుర్భావము, ఆవేశము. ప్రాదుర్భావములో మళ్ళీ పూర్ణావతారము, అంశావతారము అని రెండు రకాలున్నాయి. నరసింహ, రామకృష్ణావతరాలు పూర్ణావతారాలు. మత్స్య, కూర్మాది అవతారాలు అంశావతారాలు. అలాగే ఆవేశావతారాలలో స్వరూపావేశము, శక్త్యావేశము అని రెండున్నాయి. పరశురామునిలాగా జీవుని ద్వారా అవతార పరిగ్రహము కలిగినపుడు ఆవేశావతారము అని చెప్పబడుచున్నది. కృష్ణ



ద్వైపాయనునిలాగా భగవంతుని శక్తి ప్రవేశించటం వలన ఉద్భవించే అవతారం శక్త్యావతారమని అనబడుచున్నది.

ఇక సర్వజీవకోటి హృదయాలలో ఆత్మరూపంలో వున్న పరబ్రహ్మమూర్తి అయిన శ్రీమన్నారాయణులవారి స్వరూపమే నాలుగవదైన అంతర్యామి రూపము. సర్వకోటి హృదయాంతరాళాలలో ఆనంద స్వరూపుడైన శ్రీమన్నారాయణుడు అంతర్యామిగా భాసిస్తున్నాడు. ఇక అయిదవది అర్చాస్వరూపము, మానవులందరికి అర్చించడానికి వీలుగా దేవాలయాలలో నిత్యపూజలందుకునే శ్రీ స్వామి వారి రూపమే అర్చాస్వరూపము. ఈ అర్చారూపాలలో దేవతలచేత ప్రతిష్ఠింపబడినవి, సిద్ధులచేత ప్రతిష్ఠింపబడినవి, మానవులచేత ప్రతిష్ఠింపబడినవి వుంటాయి. శ్రీ స్వామివారు భక్తులందరికి అనువుగా, ఎల్లవేళలా అందుబాటులో వుండేది ఈ అర్చాస్వరూపంలోనే. ఈ అర్చా స్వరూపంలోనే శ్రీమన్నారాయణుడు అనేక దేవాలయాలలో దర్శనమిస్తూ భక్తులకు ఆనందం కలుగజేస్తున్నాడు.

ఒకసారి కొందరు భక్తులు భజన చేస్తూ ఒక కాలువ గట్టు వెంబడే నడుస్తున్నారు. ఆ కాలువ అతి లోతైనది. ఒకసారి కాలు జారి పడితే తిరిగి తేలడం అంటూ జరగదు. అందుకని అతిజాగ్రత్తగా నడుస్తూ వెళుతున్నారు. కొంత దూరం వెళ్ళేసరికి వారికి ఒక బాటసారి ఎదురు పడ్డాడు. అతడు కాలువ గట్టు నిల్చుని దాటడానికి ఆలోచిస్తున్నట్టుగా కనిపించాడు. ఆ భక్తులగుంపు దగ్గరకు రాగానే వారిని ఈ కాలువ లోతు ఎంత అని అడిగాడు. వారిలో కొందరు హేళనగా సమాధానం చెప్తూ ఆ ఎంతేమిటి, మోకాలి లోతే అన్నారు. ఆ మాటలు విన్న బాటసారి మరి ఆలోచించకుండా కాలువలోనికి దిగి నడుస్తూ అవతలి గట్టు క్షణంలో చేరిపోయాడు. ఇది చూసినవారికి కళ్ళు చెదిరిపోయాయి. ఇదేమిటి

ఇంత లోతు క్షణంలో ఎలా దాటేసాడు? అని ఆశ్చర్యపోయారు. ఇదీ విశ్వాసంయొక్క శక్తి. ఇదీ విశ్వాసంతో కూడిన భక్తియొక్క అద్భుత శక్తి.

ఆ శ్రీనివాసునిమీద ఎవరైతే పూర్తి విశ్వాసం వుంచుతారో వారికి జీవితం నల్లేరుమీద నడకే. ఆ స్వామినే పూర్తిగా నమ్మినవారికి ఆ అమృతమూర్తి ఎల్లప్పుడూ తోడుగా వుంటాడు. తన భక్తులంటే ఆ స్వామికి అంతటి ప్రేమానురాగాలు.

ఓ శ్రీనివాసా నీకివే మా నమస్కారములు. ఓ అమృతమూర్తీ నీకివే మా ప్రణామములు. ఓ జగన్నాథా! నీకివే మా నమస్కారములు.

*" శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీ వేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ "*

భజే శ్రీనివాసమ్

